# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు







ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



## జలుబు నొప్పులతో మీ బిడ్డను బాధపడనీయకండి

### విక్స్ వేపోరబ్ తక్షణమే ఉపశమనాన్ని కలుగజేస్తుంది... మీ బిడ్డ సులభంగా శ్వాస పీల్చుకొనుటకు సహాయపడుతుంది... రాత్రంతా సుఖంగా నిద్రిస్తాడు

మీ బిడ్డ మంచి-చెడ్డలను చూడవలసిన బాధ్యత మీది. అందు చేత బిడ్డకు జలుబు నొప్పులు వచ్చినప్పుడు, ముక్కునుండి నీరు కారుట, కండ్లనుండి నీరుకారుట, గొంతు బొంగురు పోవుట, శ్రమతో శ్వాస పీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను పులమండి.

మీ బిడ్డ జలుబుకు విక్స్ వేపోరబ్ అత్యుత్తమమైన నివారిణి ఎందుచేతనంటే ఇది జలుబు బాధిత భాగములన్నింటిలో, ఎచ్చట జలుబు ఎక్కువగా బాధిస్తుందో, అనగా, ముక్కు, గొంతు, ఛాతీలలో చాలా గుణకరంగా పనిచేస్తుంది. మీ బిడ్డ యొక్క మృదువైన చర్మానికి ఇది చాలా మంచిది.

విక్స్ వేపోరబ్‌ను పులిమి, ఉన్ని బట్టతో కప్పి, మీ బిడ్డను సుఖంగా పరుండబెట్టండి. రాత్రంతా మీ బిడ్డ సుఖంగా నిద్రించే సమయములో విక్స్ వేపోరబ్ దాని ప్రభావాన్ని కొనసాగిస్తూ వుంటుంది. ఉదయానికల్లా అతి చెడ్డ జలుబు కూడా పూర్తిగా పోయి, మీరు అమితంగా ప్రేమించే మీ గారాబు బిడ్డ సంతోషంగా మేలుకొంటాడు.




# విక్స్ వేపోరబ్

3 సైజులలో

అల్యూమినియమ్

పొంగినా ఒలకని

# మిల్క్ బాయిలర్

(పేటెంటు నం. 80320)



క్రౌన్ బ్రాండు



మూడు సైజులలో దొరకును

1, 2, 4 లిటర్లు

## జీవన్‌లాల్ (1929) లిమిటెడ్

కలకత్తా - మదరాసు - బొంబాయి - రాజమండ్రి - ఢిల్లీ - ఏడెన్

---

బంగారము కవరింగ్ చేయబడినవి.

# శ్యామలా నగలు ధరించండి.

అందమైన డిజైనులు.

No. 380

No. 785 MANGO NECKLACE

SYAMALA DOLLAR CHAIN 24" LONG No. 680.

No. 832

No. 823

No. 942

No. 943

V.R.ARTS.

REGISTERED

## శ్యామలా గోల్డు కవరింగ్ వర్క్సు

PROP:-B. వెంకటచలం.

చిలకలపూడి (P.O.) మచిలీపట్టణం. (ఆంధ్ర)

## ఎవరెస్ట్ టైనీటాట్‌తో పిల్లలు ఉల్లాసంగా వెళ్ళుతున్నారు

ఒక షోకైన చిన్న వాక్యూం ఫ్లాస్కు— స్కూలుకు వెళ్లే పిల్లలు వారి కిష్టమైన వేడి లేక చల్లటి ఆహారాన్ని, పానీయాలను తీసుకు వెళ్లటానికి గాను ప్రత్యేకంగా డిజైను చెయ్యబడ్డది. ఈ టైనీటాట్ ఎవరెస్ట్ వాక్యూం ఫ్లాస్కులకు గల అన్ని విశిష్టాంశాలను, నాణ్యమైన సామగ్రిని కలిగియుంది. మీ బిడ్డకు స్వంతానికి ఒక టైనీటాట్‌ను తెచ్చిపెట్టరా ? గర్వకారణమైన ఇట్టి వస్తువులు శక్తివంతమైన వ్యక్తిత్వాన్ని పొందగలట్లు అతని దృక్పథాన్నే మార్చ తోడ్పడగలవు. "బిడ్డ మనిషికి తండ్రి" అని కదా నానుడి!




**విక్టరీ ఫ్లాస్కు కంపెని ప్రైవేట్ లిమిటెడ్,**

బొంబాయి ★ కలకత్తా ★ ఢిల్లీ ★ మద్రాసు

కొత్త నటుడు
కె.వి.నాగేశ్వరరావును
సరికొత్త భూమికలో నాట్యతార
గీతాంజలిని
పరిచయం చేసే




ప్రసాద్ ప్రొడక్షన్స్ వారి
అద్భుత రసప్రధాన చిత్రం

# ఇల్లాలు

బ్లాక్ అండ్ వైట్ & కలర్





దర్శకత్వం
A. సంజీవరావు

సంగీతం
K.V. మహాదేవన్

రచన
ముళ్లపూడి వెంకటరమణ

దర్శక పర్యవేక్షణ
L.V. ప్రసాద్




NVKR   studio Ketha

పూర్ణా రిలీజ్

# తారతమ్యము లెరిగిన ముద్రాపకుడు

తన పనికి కావలసిన పరికరాలు, అనగా
—చక్కటి కాగితం, మంచి సిరా, స్ఫుటమైన టైపు
ఎంచుకొనుటలో ఎంతో జాగ్రత్త తీసుకొనును

అతను **గేంజస్ సిరాలనే** ఉపయోగించును

ఎందుచేతనంటే

నాణ్యమునకు, పొదుపునకు
సుఖంగా పని సాగిపోవటానికి

*ఈ సిరాలు నమ్మకమైనవని అతనికి తెలుసును*

ఫ్యాక్టరీలు: హౌరా • బొంబాయి • మద్రాసు.

---

## బ్రోంకైటిస్ ?

## పెప్స్

## తీసుకోండి !

పెప్స్ బిళ్లలను మెల్ల మెల్లగా చప్పరించండి. అందలి కమనీయమైన, ఆరోగ్యవంతమైన ఆవిరులను ఆఘ్రాణించిన వెంటనే మీకు నివారణ కలుగును... దీని వలన గొంతుక నొప్పి మరియు రొమ్ము నెలది బాధలకు నివారణకలుగును... దగ్గు మరియు జలుబును కలుగ జేసే క్రిములను నిర్మూలించుటకు ఇది సహాయ పడును. మీరు త్వరితంగానే నివారణను పొందగలరు

- ★ జలుబు మరియు గొంతుక నొప్పికి లాభదాయకమైనవి.
- ★ పిల్లలకు సురక్షితమైనవి.
- ★ అన్ని జనరల్ స్టోర్సు మరియు కెమిస్టుల వద్ద దొరుకును.

## పెప్స్

శీఘ్రముగా నివారణ నొసగును.




ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు: Ms. వినోద్ & కో, పోస్టు బాక్సు 148, హైదరాబాదు-12

తంతి: "MURSOKS"

ఫోన్ { ఫ్యాక్టరీ: 51388
అఫీసు: 24687

# వైట్ హార్స్ సబ్బు



రిజిస్టర్డ్ నం. 141241

# WHITE HORSE SOAP

జనప్రియమైన ఈ ప్రఖ్యాత సబ్బుకు మంచి గిరాకి కలదు. భాగ్యవంతులు, బీదవారు కూడా దీనిని విరివిగా వాడుచున్నారు. సిల్కు—నైలాన్—లినెన్ వంటి నాజూకైన బట్టలను ఉతుకుటలో భద్రతకు ఇది పెట్టినది పేరు.

---

తయారు చేయువారు:

## డి. బంగారు చెట్టి

నేషనల్ ఇన్‌డస్ట్రీస్

220, టి. హెచ్. రోడ్ :: మదరాసు - 21

# అమూల్ పాల ఆహారములో
# కిద్వాయి బహుమతి
# పొందిన ఫార్ములా వుంది

కేంద్ర ఆహార పరిశోధనా సంస్థ నిపుణులు—భారతదేశంలోని పసిపాపల ఆహార అవసరాలకు తగినట్లుగా — అమూల్ పాల ఆహారాన్ని సూత్రీకరించారు. తద్వారా. కిద్వాయి భహుమతిని పొందారు. అమూల్‌లోగల పదార్థములు శరీరంలోని స్నాయువులను నిర్మిస్తాయి. మీ పాపకు ఎంతో శక్తి నిస్తాయి. బరువు




సరిగా పెరగడంలో తోడ్పడుతాయి. బలమైన పళ్లు. దిట్టమైన ఎముకలు, ఆరోగ్యకరమైన నెత్తురు. సూక్ష్మమైన కంటిదృష్టి. మెత్తని చర్మము! అమూల్ వ్యాధి నిరోధక శక్తిని పెంపొందించి, శీతాదవము. రికెట్లు పాండురోగములను నివారిస్తుంది. మీ పాపకు ఎంతో మంచిది.




తాజా పాలనుండి చేసిన **అమూల్** పాల ఆహారములో మీ పాపకు కావలసిన 7 విటమినులు గలవు.





ASP-ABF 42 A TEL

# దిలీప బృందం అన్వేషణ
































JWTUC 1736



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

గాంధీజీ నాయకత్వాన స్వాతంత్ర్య సమరాన్ని సైతం అహింసాయుతంగా కొనసాగించిన మన దేశం స్వాతంత్ర్యాన్ని సంపాదిస్తూనే పాకిస్తానుతో పోరాటానికి దిగవలసి వచ్చింది. ఆ యుద్ధం విరమించబడినప్పటికీ, ఉభయదేశాల మధ్య శాంతి సౌహార్దాలు నెలకొనలేదు సరికదా, తిరిగి యుద్ధ జ్వాలలు ప్రజ్వరిల్లాయి. అవాంఛనీయమైనా, ఈ యుద్ధం ఒక్క మేలు చేసింది —కుల, జాతి, మత విభేదాలన్నిటినీ విస్మరించి దేశ ప్రజలందరూ అద్వితీయమైన ఐక్యత ప్రదర్శించారు; మన సైనికులూ, వైమానికులూ అసాధారణమైన శౌర్య పరాక్రమాలు ప్రదర్శించారు. విజయదశమీ, దీపావళీ ఉత్సవాలు రాకమునుపే యుద్ధం నిలిచిపోయింది. శుభం.

సంపుటి : 37 - నవంబర్ 1965 - సంచిక : 5

CHITRA



# భారత చరిత్ర




ఔరంగజేబు పట్టాభిషేకం రెండు మార్లు జరిగింది. అతను ఆగ్రా ఆక్రమించగానే, 1658 జులై 21 న, మొదటిసారి పట్టాభిషిక్తు డయాడు. అతని రెండవ పట్టాభిషేకం 1659 జూన్‌లో అత్యంత వైభవోపేతంగా జరిగింది. ఈ మధ్యకాలంలో అతను తన శత్రుశేషాన్ని నిర్మూలించాడు. షుజా 1659 జనవరి 5న అలహాబాదు సమీపంలో ఖజ్వాహ్ వద్ద చిత్తుగా ఓడించబడి మీర్ జుమ్లా చేత ఢాకా దాటి అరాకాన్ దాకా తరుమబడి, తరవాత పత్తా లేకుండా పోయాడు. దారాషుకోహ్ ఢిల్లీ నుంచి లాహెూరు పారిపోయి, అక్కడి నుంచి సకుటుంబంగా ముల్తాను చేరి, అక్కడి నుంచి తరుమబడి గుజరాతుకుపోయి, తరవాత అజ్మేరుకు నాలుగు మైళ్ళ దూరాన గల దేవరాయ్ వద్ద మూడురోజులు ఔరంగజేబు బలాలతో పోరాడి, ఓడిపోయి, భారతదేశంలో నిలువ నీడ కానక, సరిహద్దుకు పారిపోతూ, దారిలో తన భార్య అయిన నాదిరాబేగమ్‌ను కోల్పోయి, దైవోపహతుడై, మిత్రుడనుకున్న అఫ్ఘాన్ నాయకుడి చేత వంచించబడి, ఔరంగజేబుకు భృత్యుడైన బహాదుర్‌ఖాన్‌కు చిక్కి, 1659 ఆగస్టు 30 న శిరశ్ఛేదం పొందాడు.

ఔరంగజేబు "ఆలమ్‌గీర్" (ప్రపంచ విజేత) అనే బిరుదుతో సింహాసనం ఎక్కాడు. రెండు శతాబ్దాలుగా విస్తరించుతూ ఉండిన మొగలు సామ్రాజ్యం ఇతని హయాంలో మరింత జోరుగా విస్తరించింది. అతని కింది అధికారులు అతనికి కొత్త రాజ్యాలు సంపాదించి పెట్టారు. బిహారు గవర్నరయిన దావూద్‌ఖాన్ 1661 లో పలమౌ జయించి పెట్టాడు. ఆ యేడే, బెంగాలు గవర్నరయిన మీర్ జుమ్లా అహెూమ్‌ల పై దండెత్తాడు.

## 50. ఔరంగజేబు—సామ్రాజ్యవిస్తరణ





ఆహోమ్‌లు మంగోలు జాతికి చెందినవారు. వారు 13 వ శతాబ్ది లోనే ఎగువ బర్మా నుంచి బ్రహ్మపుత్రానదీ లోయ లోకి వచ్చి దాన్ని ఆక్రమించుకుని, క్రమంగా తమ రాజ్యాన్ని విస్తరింప జేసుకుని, హిందూ మతాచారా లవలంబించి స్థిరపడ్డారు.

మీర్‌జుమ్లా పెద్ద సేనతో 1661 నవంబరులో ఢాకా నుంచి కదిలి ఆహోమ్‌ల అధీనం నుంచి కూచిబిహారునూ, అస్సామునూ జయించి, 1662 మార్చి 17న ఆహోముల రాజధాని అయిన గఢ్‌గాంవ్ చేరాడు. మీర్‌జుమ్లా శత్రువులతో కన్న ప్రకృతితో హెచ్చుగా పోరాడి చివరకు ఎలాగో విజయం సాధించాడు. ఆహోము రాజు జయధ్వజుడు సంధికి వచ్చి, యుద్ధపరిహారమూ, ఏటా కప్పమూ చెల్లించటానికి ఒప్పుకున్నాడు. మీర్‌జుమ్లా ఢాకాకు తిరిగి వస్తూ, 1633 మార్చి 30 న దారిలో చనిపోయాడు. ఆహోములు కామరూపా రాజ్యాన్ని తిరిగి ఆక్రమించుకున్నారు.

మీర్‌జుమ్లా స్థానంలో బెంగాలు గవర్నరుగా వచ్చిన షైస్తఖాన్, ఔరంగజేబుకు మేనమామ కొడుకు. అతను దాదాపు 30 ఏళ్ళపాటు ఆ పదవిలో ఉండి, పోర్చుగీసు సముద్రపు దొంగలను శిక్షించాడు.



వాయువ్య సరిహద్దు ఔరంగజేబుకు తీరని సమస్య అయింది. ఆ ప్రదేశంలో జీవించే వివిధ అఫ్ఘాన్ తెగలవారు దృఢమైన వాళ్ళు, భూమి సారరహిత మైనది. అందుచేత వారు బందిపోటు ముఠాలుగా తయారయి, పంజాబు రాష్ట్రం లోని పట్టణాలను కొల్లగొట్ట సాగారు. మొదట్లో ఔరంగజేబు వారిని డబ్బుతో కొనజూచాడు, కాని కొండ జాతులవాళ్ళ మీద ఆ ఎత్తు పారలేదు. 1667 ఆరంభంలో భాగూ అనే వాడి నాయకత్వం కింద యూసుఫ్‌జాయీలు సాయుధ పితూరీ సాగించారు. వారి దళాలు హజార జిల్లా మీదా, పశ్చిమ పెషావర్, అటోక్



జిల్లాల మీదా విరుచుకు పడ్డాయి. ఆ పితూరీ అణచ బడింది. 1672 లో అక్మల్‌ఖాన్ నాయకత్వాన అ(ఫీదీలు మొగలుల పై తిరగబడ్డారు. వారితో యుద్ధం చేసి మొగలులు ఘోరంగా ఓడిపోయారు.

అక్మల్‌ఖాన్ ఖ్యాతి మిన్ను ముట్టింది. అటోక్‌కూ కందహారుకూ మధ్య నున్న పఠాను లందరూ యుద్ధసన్నద్ధు లయారు. ఖత్తక్ తెగకు చెందిన పఠానులు అ(ఫీదీలతో చేరారు. వారి నాయకుడు ఖూష్‌హాల్‌ఖాన్ గొప్ప కవి. అతను తన కలం తోనూ, కత్తి తోనూ తన అనుచరులను జాతీయ పోరాటానికి పురికొల్పాడు. 1674 ఫి(బవరిలో అఫ్ఘానులు సా(మాజ్య సేనలను (పతిఘటించారు. ఆ యుద్ధంలో మొగలు సేనాపతి షుజావత్‌ఖాన్ చచ్చాడు. అతని సేన కొంత బతికి బయటపడింది.

ఈ దుర్ఘటనతో ఔరంగజేబు మేలుకుని, సరిహద్దురాష్ట్రంలో సా(మాజ్యం పరువు నిలిచి ఉండటానికి గట్టి యత్నం అవసరమని (గహించాడు. అతను 1674 జులైలో పెషావరు (ప్రాంతానికి వెళ్ళి, తన రాజ నీతి నంతా ఉపయోగించి, బహుమానాలూ, పించనులూ, పదవులూ, జాగీర్లూ ఇచ్చి, వశమైనవారిని వశపరచుకుని, వశం కాని వారిని సైనిక బలంతో నిర్జించాడు. ఈ "విభజించి పాలించే" సమరస విధానంలో అఫ్ఘానిస్తాను గవర్నరైన అమిన్ ఖాన్, అతని భార్య సాహిబ్‌జీ ఇచ్చిన సలహాలు ఔరంగజేబుకు బాగా తోడ్పడ్డాయి. (విభజించి పాలించటాన్ని ఔరంగజేబు, "రెండు ఎముకలను ఒకదాని కొకటి వేసి కొట్టి, రెంటినీ విరవటం" అనేవాడు.)

మొగలుల సరిహద్దు యుద్ధాలు విజయవంతమే అయినా, మొగలాయీ సేనలు సరిహద్దులో హెచ్చుగా నియోగించబడి ఉండటం, శివాజీ సాధించిన విజయాలకు కారణభూతమై చివరకు చెరుపే చేసింది.



# నేహ్రూ కథ

## 17



జవాహర్ జైలు నుంచి బయటికి వచ్చిన ఆరేడు వారాలకు తిరిగి అరెస్టు అయాడు. జరిగిన దేమిటంటే, అలహాబాదు లోని బట్టల వర్తకు లందరూ ఒక సంఘంగా ఏర్పడి, విదేశీ వస్త్రాలు దిగుమతి చెయ్యమని ఒక ఒప్పందం జరుపుకున్నారు; ఒప్పందాన్ని ఉల్లంఘించిన వాళ్ళు జరిమానా కట్టుకోవాలి. అయితే కొందరు వర్తకులు ఈ ఒప్పందాన్ని ఉల్లంఘించి విదేశీ వస్త్రాలు అమ్మసాగారు. జైలు నుండి విడుదల అయాక ఖాదీ వ్యాప్తికీ, విదేశీ వస్త్ర బహిష్కరణకూ కృషి చేస్తున్న జవాహరు ఈ వర్తకులతో మంచిగా చెప్పి చూశాడు. ప్రయోజనం లేకపోయింది. అతను పికెటింగు కొనసాగించ నిశ్చయించాడు. వెంటనే నియమోల్లంఘనం చేసిన వర్తకులు జరిమానా లిచ్చుకున్నారు. ఇవి బట్టల వర్తకుల సంఘానికే చేరాయి.

అయినా అధికారులు జవాహరు మీద మూడు నేరాలు ఆరోపణ చేసి విచారణ జరిపారు. ఒక నేరం బెదిరించడం, ఇంకో నేరం డబ్బు గుంజటం, మూడోది దేశ ద్రోహం. జవాహరు ఆత్మసమర్థన చేసుకోలేదు, కాని ఒక ప్రకటన ఈ విధంగా చేశాడు: "ప్రేమ విశ్వాసాలు హృదయంలో నుంచి రావాలి; బజారులో దొరకవు, ప్రోద్బలం చేసి వాటిని సంపాదించలేం. మనం మన దేశ స్వాతంత్ర్యం కొరకూ, విశ్వాసాల కొరకూ పోరాడుతున్నాం. నేను మరొక జైలుయాత్ర సంతోషంగా చేస్తాను. భారతస్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడమే గొప్ప, మహాత్మాగాంధీ నాయకత్వాన పోరాడటం మరింత ఘనం. ప్రియమైన దేశం







పట్టిచ్చింది. ఒంటరిగా ఉండటానికి అతను ఖైదు బయట పడుకుని ఋతుమేఘాలను చూసేవాడు. మబ్బులను చూడనప్పుడు గంటల తరబడి చదివేవాడు. ఎప్పుడు చూసినా జవాహరు చదువుతూనే ఉండటం గమనించి జైలు సూపర్నెంటు, "పుస్తకాలు చదవటంలో ఏ మానందం ఉంది? నా మటుకు నేను పన్నెండో ఏటనే పుస్తకాలకు స్వస్తి చెప్పాను," అన్నాడు. ఆయన పుస్తకాలు చదివి బుర్ర పాడుచేసుకోలేదు కనుకనే జైళ్ళకు ఇన్‌స్పెక్టరు జనరలు కాగలిగాడేమో ననుకున్నాడు జవాహరు.

కొరకు కష్టాలు పడడం కంటె మహాభాగ్యం ఏమున్నది?—మన కలలు నిజం కావడానికి ప్రాణాలర్పించటం తప్ప!"

జవాహరుకు 18 మాసాలు శిక్ష విధించి తిరిగి లక్నో జైలుకే పంపారు. అతను వచ్చేసరికి జైలులో చాలా మార్పులు జరిగాయి. మోతీలాలు నైనితాల్ జైలుకు మార్చబడ్డాడు. ఆయన వెళ్ళాక జైలు నిర్బంధాలు హెచ్చాయి.

జవాహరును ఉంచిన బారక్‌లో యాభై మంది ఖైదీలున్నారు. మరుగు ఏ మాత్రమూ లేకపోవటమూ, బహిరంగ స్నానాలూ, బట్టలు ఉతుక్కోవటమూ అతనికి బాగా

రానురాను జైలు నిర్బంధాలు హెచ్చాయి. వచ్చిన ఉత్తరాలు నెల కొక్కసారి ఇచ్చేవారు. పై వాళ్ళను కూడా నెల కొకసారే కలుసుకోనిచ్చేవారు. వార్తాపత్రికలు పూర్తిగా నిలుపు చేయబడ్డాయి. ఈ పరిస్థితులలో ఖైదీలకూ జైలు అధికారులకూ మధ్య ఘర్షణ హెచ్చింది. ఖైదీల అలజడికి మూల కారకులు ఏడుగురని నిర్ణయించి, వారిని వేరొక చిన్న జాగాలో ఉంచారు. ఈ ఏడుగురిలో జవాహరుతో బాటు గాంధీజీ కొడుకు దేవదాసూ, గాంధీజీ సెక్రటరీ మహాదేవ దేసాయీ, పురుషోత్తమదాసుటండన్, బాలకృష్ణశర్మా ఉన్నారు.



ఈ మార్పు జవాహరుకు అనుకూలంగానే కనబడింది. ఇప్పుడు మంద లేదు. వ్యాయామం కోసం తమ ఖైదు చుట్టూ పరిగెత్తటమూ, ఏతాం తోడి కూరల మళ్ళు పెంచటమూ, నూలు తియ్యటమూ, నిర్మలమైన ఆకాశంలో నక్షత్రాలను గుర్తించటమూ, అవి రాత్రి తరవాత రాత్రి కనిపిస్తే, మిత్రులు కనిపించినట్టు ఆనందించటమూ, వారికి దినచర్య అయింది.

మోతీలాలు పైనా జవాహరు పైనా విధించబడిన జరిమానాలు వసూలు చెయ్యటానికి పోలీసులు తరచు ఆనందభవనానికి వచ్చేవారు; జరిమానాలు కట్టడం కాంగ్రెసు నియమాలకు విరుద్ధం గనక, పోలీసులు ఇంటి వస్తువులు జప్తుచేసి పట్టుకుపోయేవారు. ఇందిర చాలా చిన్న పిల్ల. పోలీసులతో పోట్లాడుతూ ఉండేది.



ఆ రోజులలో జైళ్ళ లోని కార్యక్రమం నేరస్థులను హింసించి, వారికి జైలంటే భయం పుట్టేటట్టు చెయ్యటమే గాని, వాళ్ళను సంస్కరించి, బతుకుతెరువులు మప్పటం కానేకాదు. రాజకీయ ఖైదీలకూ, నేరస్థులకూ ఏమీ తేడా చూపబడేది కాదు. రాజకీయ ఖైదీలు చదువుకున్న వాళ్ళు కావటం చేత జైలు అక్రమాలను సహించే వారు కారు. అందుచేత జైలు నిబంధనలను వారు ఏమాత్రం ఉల్లంఘించినా, జైలు అధికారులు వారిని దారుణంగా దండించేవారు. అలాటి ఉల్లంఘన చేసినందుకు ఆజాద్ అనే 15, 16 ఏళ్ళ కుర్రవాడికి కొరడాదెబ్బల శిక్ష విధించారు. ఆ కుర్రవాడు స్పృహ తప్పిపోయే దాకా దెబ్బ దెబ్బకూ, "మహాత్మాగాంధీకీ జై!" అని కేకలు పెట్టాడు. తరవాత ఆ కుర్రవాడు టెర్రరిస్టులలో చేరిపోయాడు.

గాంధీజీ అరెస్టు అనంతరం కాంగ్రెసు రెండు పక్షాలుగా చీలింది. మోతీలాలూ, దేశబంధుదాసుల నాయకత్వం కింద

కొందరు మార్పు కోరారు; కొత్తగా రాష్ట్రాల లోనూ, కేంద్రం లోనూ ఏర్పడ నున్న శాసన సభలకు జరిగే ఎన్నికలలో కాంగ్రెసు పాల్గొని, సాధ్యమైతే వాటిని వశపరచుకోవాలని ఈ వర్గం అభిప్రాయం. చక్రవర్తి రాజగోపాలాచారి మొదలైన వారు దీనికి వ్యతిరేకించి, కాంగ్రెసు శాసనోల్లంఘనాన్నే అనుసరించా లన్నారు. జవాహరు ఈ వర్గానికే చెందాడు. మరొకసారి తండ్రి కొడుకుల రాజకీయాలు భేదించాయి.

జైలు జీవితంలో అనేక లోట్లుంటాయి. ఆడవాళ్ళ కంఠాలూ, పిల్లల నవ్వులూ వినిపించవు. ఉన్నట్టుండి ఒకనాడు జవాహరుకు ఒక వింత విషయం తట్టింది—అతను కుక్క మొరగగా విని ఏ డెనిమిది మాసాలయింది! అలాటి జైలు జీవితం నుంచి, తలవని తలంపుగా, 1923 జనవరి 31న రాజకీయ ఖైదీలందరికీ ఒక్కసారిగా విమోచన కలిగింది.

జరిగిన దేమిటంటే, స్థానికరాష్ట్ర కౌన్సిలు వారు రాజకీయ ఖైదీలను విడిచిపెట్టాలని ఒక తీర్మానం చేశారు. ప్రభుత్వం ఇటువంటి తీర్మానాలను పాటించదు, కాని ఈ సమయంలో రాజకీయ వాదులను విడిచిపుచ్చ వచ్చునని భావించింది. ప్రభుత్వానికి ప్రతిగా కాంగ్రెసు చేస్తున్న దేమీ లేదు. కాంగ్రెసు వాదులు తమలో తాము కీచులాడు కుంటున్నారు. 1920 ఆఖరులోనూ, 21 ఆరంభంలోనూ శిక్షలు పడిన కాంగ్రెసు వాదు లందరూ విడుదల అయిపోయారు. జైళ్ళలో మిగిలిన కాంగ్రెసు ప్రముఖులు కొద్దిమందే.

రెండవసారి విడుదలకు ముందుగా—1922 నవంబరు 14 న జవాహరు మొట్టమొదటి సారిగా తన పుట్టినరోజు పండగ జైలు లో చేసుకున్నాడు. అటు తరవాత అతని పుట్టినరోజు పండగలు జైళ్ళలో జరిగాయి.






# 4

ఇప్పుడు పఠానులు ఒరిస్సా దేశానికి ఏలికలై; స్వర్ణదుర్గం రాజధానిగా చేసుకుని ప్రశాంతంగా కాలక్షేపం చేస్తున్నారు. కతలూ ఖాన్ అనంతరం అతని వారసులైన సులేమాన్‌ఖానునూ, ఉస్మాన్‌ఖానునూ కూడా నవాబులుగా ప్రకటించి రాజ్య భారం ముసలి వజీరైన ఈసాఖాన్ పైన మాన సింహు డుంచి రాజ్యతంత్రం ఏర్పాటు చేసి వెళ్ళిపోయాడు.

నవాబులుగా పరిగణించ బడుతున్న సులేమాన్‌ఖాన్‌కూ, ఉస్మాన్‌ఖాన్‌కూ మనస్తత్వాలలో చాలా తేడా ఉన్నది. సులేమాన్ తాగుబోతు, భోగలాలసుడు. ఉస్మాన్ ఖాన్ వీరోచిత స్వభావుడు; పఠాన్ రాజ వంశంలో పుట్టి కత్తిపట్టి యోధు డనిపించు కోకుండా తాగి తందనాలాడటం చాలా హీన మని అతని ఉద్దేశం.

మొగలాయీలే ఇప్పుడు భారత దేశానికి పాలకులుగా ఉండటం ఉస్మాన్ సహించ లేకపోయాడు. బాబరు కాలంలో పఠానుల సామ్రాజ్యం కాస్తా మొగలాయీల దయింది. అది తిరిగి పఠానులకు చెందదని ఏమున్నది? ఉస్మాన్‌కు ఇటీవల జరిగిన సంధి కూడా అసంతృప్తినే కలిగించింది.

ఉస్మాన్ మనసును కలతపెడుతున్న మరొక విషయం ఆయెషా. అత నామెను

దామోదర ముఖర్జీ






గాఢంగా ప్రేమించాడు. ఆయుషా కతలూఖాన్ సొంత కూతురు కాదు, పెంపుడు కూతురు. కతలూఖాన్ యొక్క కాశ్మీరు బేగముకు ఆయుషా అన్న కూతురు. ఆయుషా ఆరునెలల బిడ్డ అయి ఉండగా ఆమె తల్లి మరణించింది. ఆమె తండ్రి ఆమెను తన చెల్లెలి చేతిలో పెట్టాడు. ఆ తరవాత కొద్ది కాలానికి ఆయన కూడా గతించాడు. అది మొదలు ఆయుషా కతలూఖాన్ సొంత కూతురి లాగే పెరిగింది—అంతకంటె కూడా గారాబంగా పెరిగిం దనవచ్చు; అతడు ఆమెకు ప్రత్యేకించినంత ధనం తన సొంత పిల్లలలో ఎవరికీ ఇవ్వలేదు.



ఆయుషా ఉస్మాన్‌లు ఒకే వయసువాళ్ళు. కలిసి మెలిసి పెరిగారు. వారి చిన్ననాటి స్నేహం పెద్దయాక ఉస్మాన్‌లో ప్రేమ భావంగా పరిణమించింది. ఆయుషా మాత్రం ఉస్మాన్‌ను తన సొంత అన్న లాగే చూసుకుంటూ, ఆప్యాయంగా ఉండేది. ఆమె తనను ప్రేమించటం లేదనీ, జగతసింహుణ్ణి ప్రేమించిందనీ తెలిసినప్పటి నుంచీ ఉస్మాన్‌ఖాన్ తన ప్రేమాగ్నిని తనలోనే దాచుకుని, దహించుకుపోతూ వస్తున్నాడు.

ఒకనాటి అపరాహ్ణం ఉస్మాన్‌ఖాన్ ఒక విశాలమైన గదిలో కూర్చుని ఉండగా అక్కడికి ముసలి వజీరు ఈసాఖాన్ వచ్చాడు. ఇద్దరూ పరస్పరం మర్యాదలు జరుపుకుని కూర్చున్నాక, "ఏం పని మీద వచ్చారు?" అని ఉస్మాన్‌ఖాన్ వజీరు నడిగాడు.

"జగతసింహుడికి ఖైదు శిక్ష విధించినట్టు వినే ఉంటారు," అన్నాడు వజీరు.

"విన్నాను. అందువల్ల మనకు ఒరిగేదేమిటి?" అని ఉస్మాన్ అడిగాడు.

"మానసింహ మహారాజు మనతో చేసుకున్న సంధి అక్బరుపాదుషాకు నచ్చలేదని తెలుస్తున్నది. అందుచేత పాదుషా ఏదో ఒక వంకపెట్టి మనతో చేసుకున్న సంధిని రద్దు చెయ్యవచ్చు."





"దీనికీ, జగతసింహుడికి విధించబడ్డ శిక్షకూ సంబంధ మేమిటి?"

"సంబంధం ఉన్నదను కుంటాను. వెన కటి లాగా జగతసింహుడు మనకు పరమ శత్రువు కాడు. అతనికి మన పట్ల కొంత అభిమానం ఉండే అవకాశం ఉన్నట్టు నేను భావిస్తున్నాను," అన్నాడు వజీరు.

ముసలివాడు లౌక్యంగా ఆయుషాను సూచిస్తున్నా డని ఉస్మాన్ గ్రహించాడు. జగతసింహుణ్ణి ఆయుషా ప్రేమిస్తున్నప్పుడు అతనికి పఠానుల పై శత్రుభావం ఉండదని వజీరు సూచన. ఈ సంగతి గ్రహించగానే ఉస్మాన్‌కు తేళ్ళు కుట్టినట్టు బాధ కలిగింది.

"జగతసింహుడు మన మంచి కోరి, అక్బరుపాదుషాతో చెప్పి, ఇప్పు డున్న సంధికి భగ్నం రాకుండా కాపాడగలిగి ఉండేవా డని మీ ఉద్దేశం. అవునా?"

వజీరు అవు నన్నాడు.

"ఈ సంధి పట్ల మీకు ఆదరం ఉండ నవసరం లేదు. దాదాపు బెంగాలు నంతా జయించిన మనం అంతా పోగొట్టుకుని, పూరిజగన్నాథం కూడా మొగలాయీలకు ధారాదత్తం చేసేశాం. అక్బరు ఈ సంధిని రద్దుచేస్తే మనం విచారించ నవసరంలేదు," అన్నాడు ఉస్మాన్.



వజీరు కొంచెం ఆలోచించి, "అందు గురించి నేను తమతో చర్చించను. కాని ప్రస్తుతం మనం చాలా దుర్బలులమై ఉన్నాం," అన్నాడు.

"నిజమే. మానసింహుణ్ణి ఎదిరించి నిలబడగల బలశాలి ఎవడూ మనలో ఇప్పుడు లేడు. దాని కేమైనా ఉపాయం చేస్తారా?"

"నాకు మామూలు రాజకార్యాలతోనే సరిపోతున్నది."

"వాటినే చూసుకుంటూ ఉండండి. ఈ వయసులో మీరు యుద్ధపు గొడవలు పెట్టుకోలేరు. మీ వయసులో బుద్ధి సంధినీ,





శాంతినీ కోరుతుంది. ఈ సంధి ప్రస్తుతానికి అనుకూలించినా, అవమానకరమనే నా అభిప్రాయం. దీన్ని భగ్నం చేసి మొగలాయీలతో తలపడి పోరాడాలని నా ఉద్దేశం. దానికి తగిన ప్రయత్నాలన్నీ చేసి మీకు తెలియజేస్తాను," అన్నాడు ఉస్మాన్.

"మరొక్క సంగతి. త్వరలోనే మానసింహ మహారాజు పూరిజగన్నాథ క్షేత్రానికి యాత్ర వస్తున్నాడు. ఆయన మన రాజ్యంలో నుంచే ప్రయాణిస్తాడు. ఆ సందర్భంలో మన మాయనకు స్వాగత సన్మానాలు జరపవలిసి ఉంటుంది," అన్నాడు వజీరు.

ఉస్మాన్ ఉద్రేకంతో, "అసంభవం. మనం స్వతంత్రులమైన రాజులం. ఢిల్లీ పాదుషాలాటి వాళ్ళం. ఈ మానసింహుడు పాదుషా సేవకుడు," అన్నాడు.

"మనం స్వతంత్రులమైన రాజులమే అయినా ఢిల్లీ పాదుషాకు లోబడిన వాళ్ళం. ఉత్కళదేశం స్వతంత్రంగా ఉన్నది వారి దయచేతనే. అది మనం మరవరాదు."

"అస్తమానమూ శల్యంలాగా బాధిస్తూంటే ఆ విషయాన్ని మరవట మెలా జరుగుతుంది? ఈ అపకీర్తి త్వరలోనే పోగొట్టుకుంటాం లెండి," అని చెప్పి ఉస్మాన్‌ఖాన్ వజీరును పంపేశాడు.

అతను ఆలోచనానిమగ్నుడై గది నుంచి అంతఃపురం కేసి నడవ సాగాడు. అతని ఆలోచనలు ఈ ధోరణిలో నడిచాయి :

పఠానులు మొగలాయీలతో చేసుకున్న సంధి మొగలాయీలకే లాభించింది. కతలూఖాన్ ఆకస్మికంగా మరణించి ఉండకపోతే ఈ సంధి జరిగి ఉండేదే కాదు. అప్పటికి యువరాజు పఠానులకు దొరికాడు. ఒక యుద్ధంలో మానసింహుడికి ఓటమి కూడా కలిగింది. నవాబు మరణం వల్ల ఏర్పడిన అస్తవ్యస్త పరిస్థితిలో పఠానులు సంధికి ఒడబడవలిసి

వచ్చిందేగాని, వారికి నిజమైన పరాజయం కలగనే లేదు.

"మానసింహుడికి స్వాగతం చెప్పటానికీ, ఆయన భోజనం వగైరా అవసరాలు చూడటానికీ ఎవరినన్నా పెద్ద ఉద్యోగిని పంపుతాను. కట్నాలూ, కానుకలూ పంపను," అనుకుంటూ ఉస్మాన్‌ఖాన్ ముందుకు నడిచాడు.

అతని ఆలోచన ఆయషా కేసి మళ్ళింది. జగతసింహుడు దొరికినప్పుడతన్ని చంపెయ్యకపోవటం పెద్ద పొరపాటయింది; ఆయషా అతన్ని ప్రేమించింది; అతని కామెపై ప్రేమ లేకపోయినా, అతను బతికి ఉండగా ఆయషా అతన్ని ప్రేమించటం మానదు; అతన్నెలాగైనా చంపెయ్యాలి.

ఇలా అనుకుంటూ అంతఃపురం ప్రవేశించిన ఉస్మాన్‌ఖాన్‌ను కాశ్మీరుబేగమ్ పిలిచి, ఒక వార్త నిలా చెప్పింది:

"పదేళ్ళ క్రితం ఆయషా పినతండ్రి తన సర్వస్వాన్నీ ఆయషాకు రాసి చనిపోయాడు. ఆయషా తరఫున ఆ ఆస్తి స్వాధీనం చేసుకోవలిసిందని పంజాబు సుబేదారు మన నవాబుగారికి కబురు పంపాడు. నవాబుగారు ఆ ఆస్తిని కనిపెట్టి ఉండమని ఇక్కడి నుంచి మనుషులను



పంపారు. ఆ మనుషు లిప్పుడు తిరిగివచ్చి, ఆయషా కిప్పుడు తగిన వయస్సున్నది గనక ఆమె స్వయంగా వెళ్ళి ఆస్తిని స్వాధీనపరచుకోవాలని అంటున్నారు. ఆ పని కాస్త నువు చూస్తావా?"

"అక్కడ మీ అన్నల కేం పని?"

"ఒక అన్న పంజాబులో సేనాధిపతి. ఈ ఆస్తి ఆయషా కిచ్చిన అన్న జాగీరుదారు. ఆయషా తల్లి సుబేదారు కూతురు."

"ఆయషా తల్లి మొగలాయిదీ, తండ్రి పఠానూ అన్న మాట! అయితే కతలూఖాన్ పెంపుడు కూతురికి మొగల్ సుబేదారు ఆస్తి సంక్రమించటానికి అడ్డేమీ ఉండదా?"



"ఉండదు. అయుషా తండ్రి అంటే అక్బరుకు చాలా అభిమానం. అక్బరు స్వయంగా ఈ విషయమై ఆజ్ఞాపత్రం కూడా రాసి ఉన్నాడు. అయుషా అక్బరు పాదుషాకూ, అక్కడి దర్బారులో వారికీ కూడా తెలుసు."

"ఇంతకూ నేను చేయవలిసిందేమిటి?"

"అది నువే ఆలోచించు. అయుషాకు పంజాబు వెళ్ళాల నున్నది. ఆమె ఆరోగ్యం ఏమీ బాగా లేదు. స్థలం మార్పు వల్ల ఆరోగ్యం కలగవచ్చు."

"అయుషా ఆస్తి విషయం ఏదో ఒకటి చెయ్యవచ్చు. కాని అయుషా వెళ్ళిపోతే ఇక్కడ అంతా అంధకారమైపోతుంది," అన్నాడు ఉస్మాన్.

"అవును, నువు అయుషాను ప్రేమిస్తున్నావు. మీ ఇద్దరికీ వివాహ మవుతుందని మేమనుకునే వాళ్ళం. ఈ మధ్య నువు ఇటు కేసి రావటమే మానేశావు. ఆమెను చూడబోతే అలా ఉన్నది."

"అమ్మా, నా తప్పేమీ లేదు. అయుషా కోసం ప్రాణాలర్పించమంటే అర్పిస్తాను. అయుషా తన గుండెలో ఏదో చిచ్చు దాచుకుని, తాను కాలిపోతూ నన్నూ, మిమ్మల్నందర్నీ కూడా కాల్చేస్తున్నది. నే నామె నొకసారి చూడాలి."

"రెండు గడియల క్రితం ఇక్కడే ఉన్నది. ఉద్యానవనంలో తిరగబోయిందేమో. అయితే నువు పంజాబు ప్రయాణం మాట ఎప్పుడు చెబుతావు?"

"అయుషా అభిప్రాయం తెలుసుకుని నా అభిప్రాయం మీకు తెలుపుతాను. నాకు సెల విప్పించండి," అంటూ ఉస్మాన్‌ఖాన్ కాశ్మీరుబేగమ్ వద్ద సెలవు పుచ్చుకుని ఉద్యానవనం కేసి వెళ్ళాడు.

అతను అయుషా కోసం క్రీడాసరోవరం మెట్ల వద్ద వెతికాడు, చంపకవృక్షం నీడ నుండే శిలాసనం వద్ద వెతికాడు, పొగడచెట్టు





కింద వెతికాడు, గులాబీ చెట్లలో వెతికాడు, అయుషా అక్కడెక్కడా లేదు. అతను ఉద్యానవనం మధ్యనున్న ఇంటి కేసి వెళ్ళాడు. ఒక దాసి అతని కెదురువచ్చి, నవాబునందిని ఆ ఇంట ఉన్నట్టు చెప్పింది.

ఉస్మాన్ అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి వెళ్ళి, అయుషా కింద పడుకుని నిద్రపోతూండటం గమనించి వెనక్కు తిరిగి వచ్చాడు. కాని అతని కేదో సందేహం తట్టింది. అతను ఆమెను చూసిన క్షణంలోనే ఆమె మీదుగా ఏదో పాకినట్టు అతనికి అనుమానం కలిగింది.

అతను దాసీ దాన్ని త్వరగా రమ్మని చేత్తో సైగ చేసి, "నవాబునందిని నిద్రపోతున్నది. నేను లోపలికి పోవటం ఉచితం కాదు. ఆమె శరీరం పైన ఏదో పాకినట్టు కనబడింది. చూసి వస్తావా? నాకేమో భయంగా ఉంది," అన్నాడు.

దాసీది లోపలికి పోయి కంగారుగా వెంటనే తిరిగి వచ్చి, "అమ్మో, పెద్ద తాచుపాము!" అన్నది.

"కదలకు! మాట్లాడకు! అరవకు!" అని దాసీని హెచ్చరించి ఉస్మాన్ లోపలికి వెళ్ళి చూశాడు. భయంకరమైన తాచొకటి అయుషా వీపు మీదుగా ఎక్కి, ఆమె ఎడమ పార్శ్వాన తల పెట్టి నిద్రపోతున్నది. అయుషా ఏ మాత్రం కదిలినా, ఒత్తిగిలినా పామామెను కాటు వెయ్యవచ్చు. తలుచుకుంటేనే ఉస్మాన్‌కు కంపరం పుట్టుకొచ్చింది. అతను అతి జాగ్రత్తగా పాము తోకను పట్టి, పైకి ఒక్కలాగు లాగాడు. పాముకూడా క్షణంలో ఎక్కడలేని చైతన్యమూ వచ్చి, పడగ విప్పి వెనక్కు తిరిగిచూసి, కాటువేసే ప్రయత్నంలో బుసకొట్టసాగింది. అతను యుక్తిగా దాని తలను తన కుడిచేత్తో బలంగా నొక్కిపట్టాడు.

ఉస్మాన్ దాసీ దాన్ని పంపి ఒక కత్తి తెప్పించి, ఎడమచేత కత్తి పట్టుకుని, తన



కుడిచేతిని పట్టుకుని ఉన్న పాముకు చాలా చోట్ల కోతలు పెట్టాడు. చివరకు దాన్ని బలం కొద్దీ దూరంగా విసిరి పారేశాడు. చేతులకైన రక్తం కడుగుకోవటాని కతను కొలను వద్దకు వెళ్ళిన సమయంలో అయ షాకు నిద్రా భంగమయింది.

ఆమె లేచి, దాసి దాని ద్వారా ఉస్మాను అక్కడికి వచ్చినట్టు తెలుసుకుని, తనకు నిద్రలో చల్లగా తగిలినది అతని చెయ్యి అయి ఉంటుందనుకున్నది. ఆమెకు చాలా కోపం వచ్చి, అతను కొలను దగ్గిర ఉన్నా డని తెలిసి, అక్కడికి వెళ్ళి, "ఎందు కింత నీచపు పని చేశావు? నేను నిద్ర పోతున్న చోటి కెందుకు వచ్చావు?" అని దారుణంగా ప్రశ్నించింది.

"అయుషా, నేను నిన్ను ప్రేమిస్తున్నా ననీ, ప్రేమ ఉన్నచోట నీచభావాలకు చోటులేదనీ నీ కింకా తెలియదా? పెళ్ళి యీడు మించిపోయినా నే నింకా పెళ్ళాడ లేదు. నేను నవాబును, నా యిష్టం వచ్చిన స్త్రీని పెళ్ళాడగలను, ఉంపుడుగత్తెలను ఉంచుకోగలను. నీవే నా భార్యవు కావా లన్న కోరిక చేత నేనా పని చేయలేదు. నిన్ను తాకదలిస్తే నీవు నిద్ర పోతూండగా దొంగలాగా రావాలా? బహిరంగంగా నిన్ను నాదాన్ని చేసుకుంటే ఎవరడ్డుతారు? నిన్ను నేను బలాత్కరించలేదే!" అన్నాడు ఉస్మాన్. అత నామెకు తాచుపాము సంగతి చెప్పాడు.

అయుషా కన్నీరు కార్చుతూ అతని చేతులు రెండూ పట్టుకుని, "ఉస్మాన్, నీ ప్రేమ అతిపవిత్రమైనది? దాన్ని నా వంటి అపాత్రురాలి కెందుకు దానం చేస్తావు? నేను చచ్చి అయినా పోయాను కానేం? నన్నా పాము నుంచి ఎందుకు రక్షించావు, ఉస్మాన్!" అని ఏడుస్తూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది. ఉస్మాన్ హతాశుడయాడు. —(ఇంకావుంది.)



## అల్పులూ — అధికులూ

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా నీవు అధికు లందరి లోకీ అధికుడివి. అందు చేత నీ కన్న అధికుడు నిన్ను ఇలా శ్రమ పెట్టుతున్నా డనుకోవటానికి అవకాశం లేదు. బుడతమనుషులు పాంచాల రాజును చిక్కులు పెట్టినట్టుగా, నిన్నెవరో అల్పులు శ్రమ పెడుతున్నారని నాకు తోస్తున్నది. శ్రమ తెలియకుండా నీకు వారి కథ చెబుతాను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పాంచాలానికి దక్షిణ సరిహద్దు సమీపంలోని విశాలమైన ఒక కొండ కనుమలో బుడతమనుషుల రాజ్యం ఒకటి ఉండేది. వాళ్ళు కావడానికి మనుషులే అయినా, మామూలు మనుషుల చిటికెన వేలంత

## బేతాళ కథలు





ప్రమాణంలో ఉండేవారు. అయినా బుడత రాజు తక్కువ వాడేమీ కాదు. అతనికి అనేక మంది సామంతులూ, మంత్రులూ, బలగమూ, ఆస్థానకవులూ, మల్లులూ, వందిమాగధులూ ఉండేవారు.

ఒక సందర్భంలో ఈ బుడతరాజు ఒక బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేసి, తన కింద ఉన్న ప్రముఖుల నందరినీ అహ్వానించాడు. వందిమాగధులు స్తోత్రపాఠాలు చేశారు. గాయకులు పాడారు. మల్లులు మిడతలు మొదలుగా గల మృగాలతో పోరాడి వాటిని చంపేశారు. తన వైభవమంతా కళ్ళ ఎదట ప్రత్యక్షంగా కనిపిస్తూంటే బుడతరాజుకు ఆనందపారవశ్యం వచ్చేసింది. ఆ పారవశ్యంలో అతను లేచి నిలబడి, "ఇక్కడ చేరిన మీలో ఎవరైనా నా కన్న గొప్ప రాజును చూశారా?" అని అడిగాడు.

"లేదు, లేదు," అని బుడతలంతా ఏక కంఠంగా జవాబు చెప్పారు.

కాని మరుక్షణమే ఎవరో విరగబడి నవ్వుతూండటం బుడతరాజు చెవిన పడింది. ఆ నవ్వుతున్నది తన ఆస్థాన కవే. బుడతరాజు కవి నవ్వుకు కారణం అడిగాడు.

"నవ్వక ఏంచెయ్యను? మనకు ఒక యోజనం లోపు దూరంలో ఒక జాతి మనుషు లున్నారు. అలాటి మనిషి గట్టిగా కాలితో నేలను తన్నాడంటే మనమంతా కుర్చీల మీది నుంచి కిందపడి, భయంతో ప్రాణాలు విడిచేస్తాం," అన్నాడు కవి.

"ఈ ద్రోహిని వెంటనే పట్టుకుని చీకటి కొట్టులో పెట్టండి," అన్నాడు రాజు.

"మహారాజా, తొందర పడవద్దు. నా కొక నెలరోజులు వ్యవధి ఇచ్చినట్టయితే నేను చెప్పిన మాటలోని నిజం కొంతవరకైనా రుజువు చేసుకుంటాను," అన్నాడు కవి.

"సరే, వ్యవధి ఇస్తున్నాను. కాని వ్యవధి లోపుగా నీ మాట రుజువు చేసుకోలేకపోతివా,

నీకు చీకటికొట్టు తప్పదు," అన్నాడు బుడతరాజు.

బుడతకవి ఇంటికి వెళ్ళి ప్రయాణ సన్నాహమంతా చేసుకుని వెంటనే పాంచాల రాజధానికి బయలుదేరాడు. అతను ఎక్కడా ఆగకుండా వారం రోజులు ప్రయాణం చేసి రాజధానికి వచ్చి, ద్వార పాలకుడి పాదాల దగ్గిర నిలబడి గట్టిగా కేకపెట్టాడు.

ద్వారపాలకుడు కిందికి చూసి, తన మడమలంత ఎత్తున విచిత్ర ప్రాణిని చూసి, మనిషేనని గుర్తించి, ఆ సంగతి రాజుగారికి విన్నవించాడు. ఎవరో బుడతమనిషి వచ్చాడని విని పాంచాలరాజు, "ఆ బుడత మన కుబ్జుడంత ఉంటాడా?" అని అడిగాడు.

"లేదు, మహారాజా. ఈ బుడత మన కుబ్జుడి అరిచేతి మీద హాయిగా నిలబడ గలడు," అన్నాడు ద్వారపాలకుడు.

ఈ మాట విని రాజసభలో వారంతా విరగబడి నవ్వారు. అంత బుల్లిమనిషిని కళ్ళారా చూడాలన్న ఉద్దేశంతో సభలోని వాళ్ళంతా ద్వారం వద్దకు పరిగెత్తి వచ్చి బుడతకవి చుట్టూ మూగారు.

"రాక్షసబాబుల్లారా, కొంచెం దూరంగా ఉండండి. మీ ఊపిరికి నేను నిలవలేకుండా




ఉన్నాను. నేను మీ రాజుగారిని చూడ వచ్చాను. ఆ చిన్న రాక్షసాయన నన్ను రాజుగారి దగ్గిరికి తీసుకుపోతాడేమో!" అన్నాడు బుడతకవి, కుబ్జుణ్ణి చూసి.

కుబ్జుడు దగ్గిరగా వచ్చి, బుడతకవిని జాగ్రత్తగా భూమి మీది నుంచి ఎత్తి తన అరిచేతిలో నిలబెట్టుకుని, రాజు దగ్గరికి తీసుకుపోయాడు. బుడతకవిని చూసి రాజు చాలా ముచ్చటపడ్డాడు. బుడతకవి రాజుకు తమ బుడత ప్రపంచం గురించి ఎన్నో వింతలు చెప్పి, తన కవితాశక్తి కూడా ప్రదర్శించాడు. రాజసభలో వాళ్ళంతా అతని కవిత్వాన్ని మెచ్చుకున్నారు.



"బుడతకవీ, నువు మూడు రోజుల పాటు మా అతిథివిగా ఉండి మరీ వెళ్ళాలి," అన్నాడు రాజు.

"మహారాజా, మీ కుబ్జుణ్ణి మా లోకానికి అతిథిగా పంపే పక్షంలో అలాగే మీ ఆతిథ్యం స్వీకరిస్తాను," అన్నాడు బుడతకవి. రాజు సరే నన్నాడు.

మూడు రోజులూ మూడు యుగాలుగా గడిపి బుడతకవి కుబ్జుణ్ణి వెంటబెట్టుకుని తమ లోకానికి బయలుదేరాడు. ఈసారి బుడతకవికి ప్రయాణం సుఖంగానూ, శీఘ్రంగానూ సాగింది. ఎందుకంటే, అతను కుబ్జుడి తలపాగాలో కూర్చుని, దారి చెబుతూ వచ్చాడు. ఒక జాము లోపల వాళ్ళిద్దరూ బుడతలోకానికి చేరుకున్నారు.

కుబ్జుణ్ణి అంత దూరంలోనే చూసి, "అమ్మో, రాక్షసి," అంటూ బుడతలు హాహాకారాలు చేశారు. బుడతకవి రాక్షసుణ్ణి వెంటపెట్టుకొస్తున్నా డన్న వార్త బుడత రాజుకు చేరింది. రాజు బుడతకవిని పిలిపించి, "ఎక్కడికి వెళ్ళివచ్చావు? మనల్ని చంపుకు తినటానికి రాక్షసుణ్ణి ఎవణ్ణో వెంట పెట్టుకు వచ్చావుట, దేనికి?" అన్నాడు.

"అతను రాక్షసు డెందుకయింది? మరుగుజ్జు! అతని కన్న నాలుగింతలు ఎత్తుండే మనుషు లున్నారు!" అన్నాడు బుడతకవి.

బుడతరాజు కుబ్జుడి ఎత్తూ, లావూ చూసి నిర్ఘాంతపోయాడు. ఇంతకన్న కూడా పెద్ద మనుషు లుంటారంటే ఆయనకు నమ్మకం కలగలేదు.

"అసలు మనుషులను చూడాలంటే, మీరు ఈ కుబ్జుడుండే దేశానికి వెళ్ళిరండి," అన్నాడు బుడతకవి.

కొద్ది రోజులు పోయాక బుడతరాజు ఎవరితోనూ చెప్పకుండా, మనుషులను చూద్దామనే ఉద్దేశంతో గుర్రాన్నెక్కి పాంచాల రాజధానికి బయదేరి వెళ్ళాడు. ఆయన





రాజభవనానికి చేరేసరికి రాత్రి అయింది. అందరూ నిద్రపోతున్నారు. బుడతరాజుకు ఆకలి మండిపోతున్నది. ఆయన తలుపుల కిందుగా రాజభవనం లోకి ప్రవేశించి ఆహారం కోసం వెతుక్కుంటూ పాకశాలకు చేరుకున్నాడు. అక్కడ ఉన్న చిన్న చిన్న పాత్రలు కూడా పెద్ద పెద్ద గంగాళా ల్లాగా ఆయనకు తోచాయి. వాటిలో ఒక చిన్న పాత్ర అంచు మీదికి అతికష్టం మీద ఎక్కి లోపలికి తొంగి చూసేసరికి దాని లోపలి నుంచి కమ్మని వాసన వచ్చింది. ఆ పాత్ర అడుగున కొంచెంగా పాయసం ఉన్నది. దాన్ని తిందామనే ఆశతో బుడతరాజు ఆ పాత్రలోకి జారి, పాయసంలో నడుము లోతున కూరుకుపోయి, ఎంత ప్రయత్నించీ పైకి రాలేకపోయాడు.

మర్నాడు పొద్దున పాకశాలకు చెందిన స్త్రీలు ఆ పాత్రలో ఉన్న బుడతరాజును చూసి, వెనక వచ్చిన బుడతకవే ననుకుని ఆయనను తీసుకుపోయి రాజుగారి ముందుంచారు.

కుబ్జుణ్ణి చూసే భయపడిన బుడత రాజుకు అసలు మనుషులను చూడగానే ప్రాణా లెగిరిపోయినంత పని అయింది. ఆయన పాంచాల రాజును చూస్తూనే కంగారుగా, "నన్ను వదిలెయ్యండి. నేను బుడతరాజును. మా దేశంలో నన్ను ఎంతో గౌరవంగా చూస్తారు," అని కేకలు పెట్టాడు.

పాంచాల రాజు నవ్వి, "ఇది మీ దేశం కాదు. నువు మా వద్దకు గౌరవప్రదంగా రాలేదు. నిన్ను మా దాసీలు ఎంగిలి పాత్ర లలో నుంచి పైకి తీశారు. నేను నిన్ను పోనివ్వను. ఏం చెయ్యగలవు?" అని ప్రశ్నించాడు. నిజానికి బుడతరాజు ఏమీ చెయ్యలేక పోయాడు.

ఆయన పాంచాలరాజుకు బందీ అయాడని బుడతలకు తెలియడానికి చాలా కాలం పట్టింది. వాళ్ళు బుడతకవిని రాయబారిగా

పంపారు. బుడతకవి వచ్చి తమ రాజును ఇచ్చెయ్యమని వినయంగా ప్రార్థించాడు.

"ఇయ్యకపోతే మీ బుడతలు ఏం చేస్తారు?" అన్నాడు పాంచాల రాజు.

"ఏమైనా చెయ్యగలం. మాకు సంఖ్యా బలం ఉన్నది. తరవాత మీరు పశ్చాత్తాప పడగలరు," అన్నాడు బుడతకవి.

"సరే, మీ శక్తి ఏమిటో చూస్తాను. మీ రాజును ఇచ్చేది లేదు," అన్నాడు పాంచాల రాజు.

ఆ యేడు పాంచాల దేశంలో ఏ మూల ఏ రైతు ఏ ఏ ధాన్యపు మొక్క నాటినా దాన్ని ఎవరో వచ్చి ధ్వంసం చేసి పోయారు. ఆ యేడు దేశమంతటా కలిపి తూమెడు ధాన్యమైనా పండలేదు. జనం తిండికి లేక చచ్చారు, దారుణమైన క్షామం ఏర్పడింది.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. ఎవరు అల్పులు, ఎవరు అధికులు? వేలంత లేని బుడతల శక్తి గొప్పదా? మా మూలు మానవుల శక్తి గొప్పదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఏదో ఒక్క అంశాన్ని ఆధారం చేసుకుని మనం కొందరిని అల్పులనీ, మరి కొందరిని అధికులనీ అనుకుంటాం, కాని సృష్టిలో అన్ని విధాలా అల్పులైనవారూ, అన్ని విధాలా అధికులైన వారూ లేరు. దేవతల చేత సైతం ఓడకుండా వరాలు పొందిన రావణుడు కోతుల చేతిలో సర్వనాశనం పొందలేదా? అధికుణ్ణని గర్వించిన వాడు ఆ గర్వంతోనే అల్పుడవు తాడు; అన్యాయానికి గురి అయిన అల్పుడు కూడా అధికుడైపోయి అపారమైన శక్తులు ప్రదర్శిస్తాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# మంత్రి కొడుకు

టర్కీ దేశంలో ఒక సుల్తానుకు అనేక మంది భార్యలు. వాళ్ళకు నలభై మంది కొడుకు లుండేవారు. వారందరి లోకీ చిన్న వాడికి పెళ్ళి ఈడు రాగానే సుల్తాను తన నలభైమంది కొడుకులనూ పిలిచి, "ఇంక మీ రందరూ పెళ్ళిళ్ళు చేసుకోండి," అని చెప్పాడు.

సుల్తాను కొడుకు లందరూ ఒక్క తల్లి బిడ్డల లాగా ఎంతో అన్యోన్యంగా ఉండే వారు. అందుచేత వారు తమలో తాము మాట్లాడుకుని, ఒక నిర్ణయానికి వచ్చి, తమ తండ్రితో, "నలభైమంది అక్కచెల్లెళ్ళు ఎక్కడైనా ఉండే పక్షంలో మేం వాళ్ళని పెళ్ళాడతాం," అన్నారు.

"ఒక్క కుటుంబంలో నలభై మంది అక్కచెల్లెళ్ళు దొరకటం సాధ్యమా?" అన్నాడు సుల్తాను.

"సాధ్యం కాకపోతే మేం పెళ్ళి చేసుకోనే చేసుకోం," అన్నారు సుల్తాను కొడుకులు ఏక కంఠంగా.

వారి పట్టుదల చూసి సుల్తాను తన దేశ మంతటా చాటింపు వేయించాడు, నాలుగు మూలలకూ తన భటులను పంపి ఎక్కడైనా నలభై మంది అక్కచెల్లెళ్ళున్నారేమో తెలుసుకు రమ్మన్నాడు. ముప్ఫై తొమ్మిది మంది అక్కచెల్లెళ్ళున్న కుటుంబం కూడా కనిపించింది గాని, నలభై మంది గల కుటుంబం దేశంలో ఎక్కడా కనబడలేదు.

"ప్రపంచం గొడ్డుపోయిందా? భూమి మీద ఇంకా అనేక దేశా లున్నాయి. అన్ని దేశాలూ గాలించి, నలభైమంది అక్కచెల్లెళ్ళు ఎక్కడ ఉంటే అక్కడే పెళ్ళాడతాం," అన్నారు సుల్తాను కొడుకులు.

జి. నాగభూషణరావు




విధిలేక సుల్తాను సరే నన్నాడు. తన కొడుకులు దేశాటనకు బయలుదేరే టప్పు డాయన వారి వెంట తన పెద్ద వజీరు కొడుకును తోడుగా పంపుతూ, వారందరికీ ఈ విధంగా హెచ్చరిక చేశాడు: "మన దేశపు సరిహద్దు దాటి కొంత దూరం వెళ్ళాక ఒక బావి వస్తుంది; అక్కడ మీరు రాత్రి నిద్ర చెయ్యకండి. ఇంకా కొంత దూరం వెళ్ళాక ఒక మజిలీ స్థలం వస్తుంది; అక్కడ కూడా నిద్ర చెయ్యకండి. ఆ తర వాత ఒక ఎడారి వస్తుంది; ఆ ఎడారి దాటే దాకా ఎక్కడా నిద్ర చెయ్యకండి. సుఖంగా వెళ్ళిరండి."

సుల్తాను దీవన పొంది, ఆయన కొడుకులూ, మంత్రి కొడుకూ గుర్రా లెక్కి ప్రయాణ మయారు. సరిహద్దు దాటి బావి వద్దకు చేరేసరికి సాయంకాల మయింది. అక్కడ వారు భోజనాలు చేసి, కొంత సేపు విశ్రాంతి తీసుకున్న మీదట, సుల్తాను పెద్ద కొడుకు, "నేను బాగా అలిసిపోయాను. ఇవాళ ఇక ప్రయాణం చెయ్యలేను. ఈ రాత్రి కిక్కడే పడుకుందాం," అన్నాడు.

"ఇక్కడ నిద్ర చెయ్యవద్దని సుల్తాను గారు మరీ మరీ చెప్పారు," అన్నాడు మంత్రి కొడుకు.

"నలభైఒక్క మందిమి ఉన్నాం. మన కేం అపాయం వస్తుంది?" అన్నారు సుల్తాను కొడుకు లందరూ. వాళ్ళు ఆ రాత్రి అక్కడే పడుకుని సుఖంగా నిద్రపోయారు. ఒక్క మంత్రి కొడుకు మాత్రం కళ్ళలో వత్తులు వేసుకుని మేలుకున్నాడు.

అర్ధరాత్రి కాబోతుండగా అతడికి ఏదో అలికిడి వినిపించింది. అతను కత్తి దూసి లేచి కూర్చుని, అంత దూరంలో పెద్ద ఏడు తలల పాము నొకదాన్ని చూశాడు. అతను కత్తి ఝుళిపిస్తూ దాని పైన కలియబడ్డాడు. ఇద్దరికీ కొంత సంఘర్షణ జరిగాక అతను తన కత్తితో పాము తలలు ఒక్కొక్కటిగా

నరకసాగాడు. దాని తలలలో ఆరు తెగిన చోటనే పడ్డాయి గాని, దాని ఏడో తల మటుకు దొర్లుతూ వెళ్ళి బావిలో పడింది.

అలా జరగటానికి కారణ మేమిటో తెలుసుకుందామని అతను ఒక పెద్ద మోకు తెచ్చి, దాని ఒక చివర బావి పక్కన ఉన్న రాతికి గట్టిగా కట్టి, రెండవ చివర తన నడుముకు చుట్టుకుని, ఆ మోకు సహాయంతో బావి అడుగుకు దిగాడు. అడుగుకు చేరేసరికి అతనికి ఎదురుగా ఒక పెద్ద తలుపు కనిపించింది. ఆ తలుపు తెరిచేసరికి, కొంచెం దూరాన చాలా అందమైన భవనం కనిపించింది.

మంత్రి కొడుకు ఆ భవనం లోకి ప్రవేశించి నడపల వెంబడి నడవసాగాడు. నడవలకు రెండు పక్కలా గదు లున్నాయి. ఒక్కొక్క గదిలోనూ ఒక్కొక్క అందమైన యువతి ఉన్నది. మొత్తం నలభై గదుల లోనూ నలభై మంది అందగత్తె లున్నారు. వారు మంత్రికొడుకు అక్కడికి రావటం చూసి భయపడ్డారు.

"మీకు వచ్చిన భయమేమీ లేదు. నే నింతకు ముందే ఏడు తలల నాగేంద్రుణ్ణి చంపాను. ఒక తల బావి లోకి దొర్లితే దాని వెనకగా నేను కూడా దిగి వచ్చాను," అన్నా డతను.





అ మాట వినగానే వాళ్ళు, "మా చెర విడిపోయింది. ఇంక మే మిక్కడ ఉండం. మేము నలభై మందిమీ అక్కచెల్లెళ్ళం. అందుచేత మమ్మల్నందర్నీ నీ వెంట తీసుకుపో," అన్నారు.

"కొంచెం ఓపిక పట్టండి. నేను త్వరలోనే మళ్ళీ వచ్చి, మీ విషయం ఆలోచిస్తాను," అంటూ మంత్రి కొడుకు అక్కడి నుంచి కదిలి, తాడు సహాయంతో తిరిగి భూమి మీదికి వచ్చేశాడు. సుల్తాను కొడుకులందరూ గాఢనిద్రలో ఉన్నారు. అతను కూడా తన స్థానంలో పడుకుని వెంటనే నిద్రపోయాడు.

సుల్తాను కొడుకులు తెల్లవారి నిద్ర లేచి, "హాయిగా నిద్ర పట్టింది. నాన్నగారు నిష్కారణంగా మనని భయపెట్టారు. ఇక నడక సాగింతాం," అన్నారు. మంత్రి కొడుకు వారితో పాము మాట చెప్పనే లేదు.

వాళ్ళు ఆ రోజల్లా ప్రయాణం చేసి సాయంకాలానికి మజిలీ చేరుకున్నారు.

"ఈ రాత్రి ఇక్కడ గడపటానికి దివ్యంగా ఉంది," అన్నాడు సుల్తాను పెద్ద కొడుకు.

"మీరు మళ్ళీ సుల్తానుగారి హెచ్చరికను మరుస్తున్నారు," అని మంత్రి కొడుకు జ్ఞాపకం చేశాడు.

"ఆయన హెచ్చరికల కేమొచ్చెలే? ఆ బావి దగ్గర నిద్ర చెయ్యవద్దన్నాడు. చేశాం. ఏం నష్ట మయింది?" అన్నారు సుల్తాను కొడుకులు.

ఆ రాత్రికి వాళ్ళు ఆ మజిలీ ప్రదేశంలోనే పడుకుని నిద్రపోయారు. మంత్రి కొడుకు మాత్రం కన్ను మూయ్యలేదు. తిరిగి అర్ధరాత్రి వేళ మరొక ఏడు తలల పాము, కిందటి రాత్రి వచ్చిన దాని కన్న బాగా పెద్దదీ, మరింత భయంకరమైనదీ వచ్చింది. మంత్రి కొడుకు ఎంతో తెగువగా దానితో కలియబడి, చాలాసేపు పోరాడి, ఎలాగై

తేసేం, దాని ఏడు తలలూ వరుసగా నరికే శాడు. ఈ సారి కూడా దాని ఏడో తల దొర్లుతూ చాలా దూరం వెళ్ళి, ఒక బావిలో పడిపోయింది. మంత్రి కొడుకు ఆ బావిలో కూడా దిగి, అక్కడ కనిపించిన వాకిలి తెరిచి, మరొక గొప్ప భవనాన్ని చూశాడు. అందులో కూడా నలభై గదు లున్నాయి. ఒక్కొక్క గదిలోనూ అంతులేని రత్న రాసులున్నాయి.

మంత్రి కొడుకు తిరిగి పైకి వచ్చి, తన స్థానంలో పడుకుని తెల్లవారే దాకా నిద్ర పోయాడు. తెల్లవారి అందరూ లేచి ప్రయాణమై, అనేక కొండలూ, లోయలూ దాటి, సాయంకాలానికి ఒక ఎడారి చేరుకున్నారు. అక్కడ వారు కడుపునిండా తిండి తిని, రాత్రికి విశ్రమించాలని నిశ్చయించారు. ఈ సారి కూడా మంత్రి కొడుకు వారిని హెచ్చరించాడు గాని వాళ్ళు అతని హెచ్చరికలను ఏమీ లక్ష్యపెట్టక, అక్కడే పక్కలు పరిచి పడుకున్నారు.

వారి కింకా నిద్ర పట్టక ముందే భూకంపం వచ్చినట్టూ, కొండలు చలించినట్టూ అయింది. ఒక బ్రహ్మాండమైన ఏడు తలల పాము, అతి భయంకరమైన ఆకారంతో అంత దూరాన ప్రత్యక్షమై, నోళ్ళ మంటలు గక్కుతూ, "మీలో నా తమ్మ





ళ్ళను చంపినవా డెవడో వాణ్ణి పంపండి. వాణ్ణి ఇప్పుడే పిప్పి చేసేస్తాను," అని గర్జించింది.

సుల్తాను కొడుకు లా మహా సర్పాన్నీ, దాని మాటలనూ విని గడగడా వణికిపో యారు. ఆ పామును ఎదుర్కోవటంలో వాళ్ళు తనకేమీ సహాయ పడలేరని గ్రహించి మంత్రి కొడుకు వారితో, "మీరు వచ్చిన దారినే వెనక్కు వెళ్ళండి. మజిలీ స్థలంలో ఫలాని చోట ఒక బావి ఉంది. అందులోకి దిగితే ఒక ద్వారమూ, దాని అవతల ఒక గొప్ప భవనమూ కనిపిస్తాయి. ఆ భవనంలో నలభై గదు లున్నాయి. ఒక్కొక్క గదిలోనూ రత్నరాసు లున్నాయి. వాటిని తీసుకోండి. మొదటి రాత్రి మనం పడుకున్న చోట కూడా బావి లోకి దిగితే మరొక భవనం ఉన్నది. అందులో నలభైమంది అక్క చెల్లెళ్ళు, చాలా అందమైన వాళ్ళున్నారు. వాళ్ళను వెంటబెట్టుకుని పోయి మీరు పెళ్ళిళ్ళు చేసుకోండి. నే నీ పాము సంగతి తేల్చగలిగితే మీ వెనకే వస్తాను. లేకపోతే నా మీద ఆశ పెట్టుకోవద్దు," అన్నాడు.

మంత్రి కొడుకు ఆ మాట అన్నదే చాలు నన్నట్టుగా సుల్తాను కొడుకులు వచ్చిన దారి పట్టారు. మంత్రి కొడుకు కత్తి దూసి పాముతో తలపడ్డాడు. ఇద్దరికీ గంటల తరబడి మహా దారుణమైన యుద్ధం సాగింది. ఇద్దరి బలమూ క్రమంగా క్షీణిం చిందే తప్ప ఒకరిదీ పై చెయ్యి కాలేదు.

ఆ కుర్రవాణ్ణి చంపే శక్తి తనకు లేదని గ్రహించి ఆ మహాసర్పం, అతని నాశనానికి మరో ఉపాయం ఆలోచించి, "కొంచెం ఆగు! మనం రాజీ పడదాం." అన్నది.

"రాజీయా, ఏ విధంగా?" అని అడి గాడు మంత్రి కొడుకు.

"ఇరాన్ దేశపు చక్రవర్తి కూతుర్ని తెచ్చి నాకు అప్పజెప్పావంటే నాకు నీతో ఏమీ పేచీ లేదు," అన్నది సర్పం.

"అక్కడికి పోవటమెలా?" అని మంత్రి కొడుకు అడిగాడు.

"ఈ కళ్ళెం తీసుకో. ఇంకాస్సేపటికి ఇక్కడి కొక తెల్లని గుర్రం వస్తుంది. అది రోజూ ఈ ప్రాంతాల మేస్తూ ఉంటుంది. దానికి ఈ కళ్ళెం తగిలించి, ఫలాని చోటికి వెళ్ళమని చెబితే క్షణంలో నిన్నక్కడికి చేర్చుతుంది. నీ పని అయేదాకా ఆ గుర్రాన్ని నీ వెంట ఉంచుకుని, చక్రవర్తి కుమార్తెతో తిరిగి యిక్కడికి రా," అని చెప్పి సర్పం అదృశ్యమయింది.

తెల్లవారుతూండగా అక్కడి కొక గొప్ప గుర్రం ఆకాశం మీదుగా వచ్చి ఆ ప్రాంతాన వాలింది. మంత్రి కొడుకు తన చేతిలో ఉన్న కళ్ళెం దానికి తగిలించి, "నన్ను ఇరాను దేశపు చక్రవర్తి ఇంటి సమీపంలో చేర్చు," అంటూ ఆ గుర్రం మీద ఎక్కాడు.

అతను కన్ను మూసి తెరిచే లోపుగా ఇరాను చక్రవర్తి రాజభవనం వెలపల దిగాడు.

"నేను తలచుకున్నప్పుడు మళ్ళీ రా," అని గుర్రంతో చెప్పి, అతను దాని మీది నుంచి కిందికి దిగాడు. మరు క్షణం గుర్రం మాయమయింది.

మంత్రి కొడుకు పేదరాసి పెద్దమ్మ ఇంటికి వెళ్ళి అక్కడ బస ఏర్పాటు చేసుకుని, అక్కడి విశేషాలన్నీ తెలుసుకున్నాడు.






"ఏడు తలల నాగేంద్రుడు చక్రవర్తి కూతుర్ని కోరాడు. చక్రవర్తి అందుకు ఒప్పుకోక నాగేంద్రుడితో వైరం పెట్టుకున్నాడు. ఈ వైరం ఎలా ముగిసేదీ తెలీదు. నాగేంద్రుడికి భయపడి చక్రవర్తి తన కూతుర్ని రాజ భవనంలో లేకుండా, ఒకానొక రహస్యప్రదేశంలో వుంచాడు," అన్నది పేదరాసి పెద్దమ్మ.

"ఎక్కడ వుంచాడో నీకు తెలుసా?" అని మంత్రి కొడుకు అడిగాడు.

"ఇది చాలా రహస్యం. రాజోద్యానంలో ఒక చిన్న ఇల్లున్నది. చక్రవర్తి కూతురు అందులో ఉన్నది. తోటకు అహోరాత్రాలు బలమైన పహరా ఉంటుంది," అన్నది పేదరాసి పెద్దమ్మ.

అంత బందోబస్తులో ఉన్న చక్రవర్తి కుమార్తెను దొంగతనంగా ఎత్తుకు పోవటం సాధ్యం కాదు. అందుచేత మంత్రి కుమారుడు మామూలుబట్టలు వేసుకుని, ఉద్యానవనానికి వెళ్ళి, తోటపని చెయ్యటానికి వచ్చినట్టు పహరా వాళ్ళతో చెప్పాడు. వాళ్ళు అతన్ని ప్రధాన తోటమాలి దగ్గిరికి పంపారు. కుర్రవాడు అందంగా ఉన్నాడు, బుద్ధిమంతుడల్లే ఉన్నాడు. తోటమాలి అతన్ని చెట్లకు నీళ్ళుపోసే వాళ్ళమీద పెత్తనం చెయ్యటానికి ఏర్పాటుచేశాడు.

ఎవరో కొత్త యువకుడు తోటలో అటూ ఇటూ తిరుగుతూ ఉండటం చక్రవర్తి కూతురు కిటికీకుండా చూసి, అతన్ని ప్రేమించింది. ఒకసారి అతను కిటికీకి దగ్గిరలో ఉండగా ఆమె పిలిచి, "ఎవరు నువు? ఇక్కడి కెలా వచ్చావు?" అని రహస్యంగా అడిగింది.

"నేను టర్కీ దేశపు వజీరు కొడుకును. రెండు ఏడు తలల పాములను చంపాను. మూడో ఏడు తలల పాము నన్నిక్కడికి పంపగా వచ్చాను," అన్నాడు మంత్రి కొడుకు ఆమెతో.

ఏడు తలల పాము పేరు చెప్పగానే చక్రవర్తి కుమార్తె ముఖం పాలిపోయింది.

"భయపడకు. నువు నా వెంట వచ్చావంటే మనం ఏదో ఉపాయం చేసి ఆ పామును చంపవచ్చు," అన్నాడు మంత్రి కొడుకు.

ఆమె అతనిలో పూర్తి విశ్వాసం ఉంచి ఆ రాత్రే అతని వెంట బయలుదేరింది. ఇద్దరూ ఉద్యానవనం వెనుక మార్గంగా బయటికి వచ్చి, కాలి నడకను నగరం దాటి ఎడారి ప్రాంతానికి చేరుకున్నారు.

దారిలో మంత్రి కొడుకు చక్రవర్తి కుమార్తెతో, "ఈ సర్పం ప్రాణం ఏదో రహస్య స్థానంలో ఉన్నది. లేకపోతే నేను దాన్ని సులువుగా చంపి ఉందును. ఆ రహస్యం నువు తెలుసుకోవాలి. అందు కొక ఉపాయం చెయ్యి. అస్తమానమూ ఏడుస్తూ ఉండు. ఎందు కేడుస్తున్నా వని అడిగితే, 'నీ కందరూ శత్రువులే, ఎవరు ఏ క్షణాన చంపేస్తారో! అప్పుడు నా గతేం కాను? నన్ను నా తండ్రి తిరిగి రానివ్వడు,' అని మరింత గట్టిగా ఏడు. నీ ఏడుపు పోగొట్టటానికి పాము తన ప్రాణ రహస్యం చెప్పేస్తుంది. దాన్ని నాకు తెలియజెయ్యి," అన్నాడు.

చక్రవర్తి కూతురు అతను చెప్పినట్టే సర్పం వద్ద నాటకం ఆడి, ఆ సర్పం



యొక్క ప్రాణాలు సముద్రం అవతల ఒక కోటలో ఉండే సింహం కడుపులో ఉన్నట్టు తెలుసుకున్నది.

ఈ సంగతి తెలియగానే మంత్రి కొడుకు తన వద్ద ఉన్న కళ్ళాన్ని పైకి తీసి, గుర్రాన్ని తలుచుకున్నాడు. తక్షణమే అది వచ్చి వాలింది. మంత్రి కొడుకు దాని మీద ఎక్కి రెప్పపాటు కాలంలో సముద్రం అవతల ఉన్న కోటదగ్గిర దిగాడు. అతను కోటలోకి ప్రవేశించగానే గాండ్రు మంటూ ఒక సింహం అతని పైన పడింది. అందుకు సిద్ధంగానే ఉన్న మంత్రి కొడుకు తన కత్తితో ఒక్క వేటున దాని తల నరికి, దాని పొట్ట చీల్చాడు. అందులో నుంచి ఒక పావురం బయటికి వచ్చి ఎగిరి పోబోయింది. అదృష్టవశాన మంత్రి కొడుకు దాన్ని పట్టుకోగలిగాడు.

అతను మళ్ళీ గుర్రం మీదనే సర్పం ఉండే చోటికి ఆ పావురంతో తిరిగి వచ్చాడు. అతని చేతిలో ఆ పావురాన్ని చూడగానే సర్పానికి దడ పుట్టింది. "నా ప్రాణం! ఒక్కసారి దాన్ని నా చేతికియ్యి! నిమిరి సంతోషిస్తాను," అన్నది సర్పం.

మంత్రి కొడుకు మోసం గ్రహించలేక ఆ పావురాన్ని సర్పానికి ఇవ్వబోయాడు. చక్రవర్తి కూతురు చప్పున ముందుకు వచ్చి ఆ పావురాన్ని మంత్రి కొడుకు చేతి నుంచి లాక్కుని, దాన్ని మెడ విరిచి చంపి అవతల పారేసింది.

వెంటనే ఏడు తలల మహాసర్పం చచ్చి పడిపోయింది.

మంత్రి కొడుకు చక్రవర్తి కూతురితో సహా గుర్రం మీద ఇరాను చక్రవర్తి ఇంటికి వెళ్ళాడు. తన ప్రబల శత్రువైన మహా సర్పం చచ్చిపోయిందని విని చక్రవర్తి పరమానందభరితుడై, తన కుమార్తెను దాని బారి నుంచి కాపాడిన మంత్రి కొడుక్కు యిచ్చి పెళ్ళిచేశాడు.






ఒకప్పుడు ఉజ్జయినీ నగర రాజ్యాన్ని పాలించిన అదిత్యసేనుడు తేజస్వతి అనే వైశ్యకన్య యొక్క అసాధారణ సౌందర్యానికి ముగ్ధుడై ఆమెను పెళ్ళాడి, తన పట్టపు రాణిని చేసుకున్నాడు. వారికి ఒక చక్కని కుమార్తె పుట్టింది. ఆమెకు చంద్రకళ అని పేరు పెట్టుకున్నారు.

తన భార్యను క్షణమైనా విడవలేని అదిత్యసేన మహారాజు ఒక సామంతుడి తిరుగుబాటును అణచటానికి సేనతో కదిలి పోతూ, తేజస్వతిని ఒక ఏనుగు పైన ఎక్కించుకుని, తాను గుర్రం ఎక్కి అమె వెంటనే నడిచాడు. కొంత దూరం వెళ్ళే సరికి రాజెక్కిన గుర్రం ఏ కారణం చేతనో బెదిరి, వాయువేగంతో ముందుకు పరిగెత్త సాగింది. రాజు దాన్ని నిగ్రహించలేక పోయాడు, రాజభటులు తమ గుర్రాలను ఎంత వేగంగా పరిగెత్తించి కూడా రాజుగారి గుర్రాన్ని అందుకోలేక పోయారు. చేసేది లేక సైనికులు రాణితో సహా వెనక్కు తిరిగి ఉజ్జయినికే వెళ్ళిపోయారు.

అదిత్యసేనుడి గుర్రం అలా పోయి పోయి ఎక్కడో అరణ్య మధ్యంలో ఆగింది. అది మళ్ళీ అదుపులోకి రావడం గ్రహించి రాజు దాన్ని తిరిగి ఇంటి దారి పట్టించి, చీకటి పడే సరికి ఉజ్జయిని చేరుకున్నాడు. అయితే నగర ద్వారాలు మూసి ఉన్నాయి. అందుచేత అయన శ్మశానం వెలపల ఉండే బ్రాహ్మణమఠంలో ఆ రాత్రి గడపా లనుకుని అక్కడికి వెళ్ళాడు. కాని మఠం లోని బ్రాహ్మణులు రాజును గుర్తించక, లోపలికి రానివ్వలేదు.

అప్పుడు ఆ మఠంలో ఉన్న సుదర్శను డనే బ్రాహ్మణ యువకుడు మిగిలిన వారిని అదిలించి, రాజుకు శ్రమ తీరేటట్టు దాసీల చేత ఉపచారాలు చేయించి, అయనకు







భోజనం తయారు చేయించి పెట్టించి, ఆయన గుర్రానికి గడ్డి వేయించి, చక్కగా ఆతిథ్యం నెరిపాడు. రాజు ఆ రాత్రి సుఖంగా నిద్రపోయి లేచే సరికి గుర్రం జీను వేసి సిద్ధంగా ఉన్నది. ఈ సపర్యలకు రాజు ఎంతో ఆనందించి, ఉజ్జయిని చేరుతూనే సుదర్శనుణ్ణీ, మఠం లోని ఇతర బ్రాహ్మణులనూ పిలిపించి, సుదర్శనుడికి వెయ్యి గ్రామాలూ, ఛత్రవాహనాలూ ఇచ్చి, అతన్ని తన మంత్రివర్గంలో పురోహితుణ్ణిగా నియమించాడు. సుదర్శనుడా గ్రామాలను మిగిలిన బ్రాహ్మణులతో బాటు పంచుకుని, వారితో సమానంగా అనుభవిస్తూ వచ్చాడు.

అయితే బ్రాహ్మణులు ధనగర్వం వచ్చి, తమలో తాము కీచులాడుకుని గ్రామాలను అధోగతికి తెచ్చారు. సుదర్శనుడు వారి కీచులాటలకు అతీతంగా ఉండిపోయాడు. నిజానికతను గొప్ప సత్త్వవంతుడు; అగ్నిని ఆరాధించి, ప్రత్యక్షం చేసుకుని, తలచుకున్న మాత్రాన ఆగ్నేయ ఖడ్గం చేతిలో ఉండే లాగు వరం పొందినవాడు.

ఒకసారి బ్రాహ్మణుల మధ్య కలహం తారస్థాయికి వచ్చింది. అప్పుడు చక్రధరుడనే బ్రాహ్మణుడు వచ్చి, "మీరు పరమ మూర్ఖులుగా ఉన్నారు. మీలో ఒకణ్ణి నాయకుడుగా చేసుకుని, అతను చెప్పినట్టు నడచుకోండి," అని సలహా ఇచ్చాడు.

నాయకుడుగా ఉండటానికి నేనంటే నేనని మళ్ళీ జగడం సాగించారు మూర్ఖ బ్రాహ్మణులు.

అప్పుడు చక్రధరుడు వారితో, "శ్మశానంలో ముగ్గురు మనుషులు కొరత వేయబడి ఉన్నారు. మీలో ఎవరు రాత్రివేళ వెళ్ళి, వాళ్ళ ముక్కులు కోసుకువస్తే వాడు నిజమైన సాహసి. వాణ్ణి మీరు నాయకుడుగా ఉంచుకోండి," అన్నాడు.

అందుకు మరెవ్వరూ ఒప్పుకోలేదు, సుదర్శనుడు తానా పని చేస్తానన్నాడు.



ఆ రాత్రి అతను ఆగ్నేయఖడ్గం చేతబూని, కొరివిదయ్యాల మంటల మధ్యగా శ్మశానం ప్రవేసించి, కొరత వేయబడిన వారి శవాల ముక్కలను కోసి, బట్ట చెంగున మూట గట్టుకుని బయలుదేరాడు.

దారిలో అతని కొక సన్యాసి శవం మీద కూర్చుని జపం చేస్తూ ఉండటం కనబడింది. ఏం జరుగుతుందో చూడాలని సుదర్శను డొక రహస్య స్థలంలో దాగాడు. చూస్తూండ గానే శవం ఫూత్కారం చేసి, నోట మంటలు కక్కింది; దాని బొడ్డులో నుంచి ఆవాలు వచ్చాయి. సన్యాసి ఆ అవాలను తీసుకుని శవాన్ని అరిచేత్తో తట్టాడు. వెంటనే, బేతాళు డావహించిన ఆ శవం లేచి నిలబడింది. సన్యాసి దాని భుజాల మీద ఎక్కాడు. శవం నడుస్తూ, కొంచెం దూరంలో ఉన్న కాళికాలయానికి వెళ్ళింది. అక్కడ సన్యాసి దిగగానే శవం పడిపోయింది. సన్యాసి దేవిని పూజించి, తాను కోరిన వర మియ్యక పోతే తాను దేవికి బలి అయిపోతా నన్నాడు.

అప్పు డొక కంఠం ఇలా పలికింది: "ఆదిత్యసేన మహారాజు కుమార్తెను తెచ్చి నాకు బలి ఇయ్యి, నీ కోరిక సిద్ధిస్తుంది."

వెంటనే సన్యాసి శవాన్ని తట్టిలేపి, దాని మీద ఎక్కి బయలుదేరాడు. బేతాళుడావ హించిన ఆ శవం ఆకాశానికి లేచింది.

సుదర్శనుడికి సన్యాసి మీద పట్టరాని ఆగ్రహం వచ్చింది. తాను బతికి ఉండగానే ఆ దుర్మార్గుడు రాజకుమార్తెను ఎలా బలి ఇస్తాడో చూతామని అతను అక్కడే ఉండిపోయాడు. కొంతసేపటికి సన్యాసి, రాజకుమార్తె చంద్రకళతో సహా, ఆకాశం నుంచి ఆలయంలోకి దిగాడు. వాడు రాజకుమార్తెను బలి ఇచ్చేలోపుగా సుదర్శనుడు ఆలయంలోకి జొరబడి, సన్యాసి జుట్టు పట్టుకుని, వాడి మెడను తన కత్తితో నరికేశాడు.

అతను, భయంతో ముడుచుకుపోయి ఉన్న రాజకుమార్తెను ఓదార్చి, ఆమెను అంత రాత్రివేళ రాజభవనం చేర్చటం ఎలాగా అని ఆలోచిస్తుండగా, ఒక వాక్కు ఇలా పలికింది: "ఈ సన్యాసికి సిద్ధించిన ఆవాలతో నీకు ఈ ఒక్కరాత్రికి ఆకాశగమనశక్తి లభిస్తుంది. వాటిని తీసుకో."

సుదర్శను డీ మాట విని సంతోషించి, సన్యాసి బట్టముడి విప్పి ఆవాలు తీసుకుని, రాజకుమార్తె నెత్తుకుని, బయటికి వచ్చాడు. అప్పు డతనికి మరొక కంఠం ఇలా వినిపించింది: "మహా వీరుడా! నెల రోజులు గడిచాక ఇక్కడికే రా. మరవకు."

సుదర్శనుడా కంఠానికి, "అలాగే వస్తాను," అని జవాబు చెప్పి, రాజకుమా





రైతో సహా ఆకాశంలోకి లేచి, రాజభవనంలో దిగాడు. అతను ఆమెతో, "నా కిప్పుడే సెలవియ్యి, వెళ్ళిపోతాను. తెల్లవారితే అవాలు పని చెయ్యవు. తెల్లవారాక భవనంలో నన్నందరూ చూస్తే ఏమైనా అనుకుంటారు," అన్నాడు.

కాని చంద్రకళ అతన్ని పోనివ్వలేదు. అతను వెళ్ళిపోతే తన ప్రాణాలు పోతాయన్నది. ఆమె చాలా భయంచెంది ఉన్నదని గ్రహించి, ఏమైనా సరే అక్కడే తోడుగా ఉందామనుకున్నాడు సుదర్శనుడు. అయితే అతనికి త్వరలోనే నిద్ర పట్టింది. రాజకుమార్తె తెల్లవారిన దాకా కన్ను మూయలేదు. తెల్లవారినాక కూడా ఆమెకు, గాఢ నిద్రలో ఉన్న అతన్ని లేప బుద్ధి కాలేదు.

తెల్లవారి పరిచారికలు వచ్చి, రాజకుమార్తె మందిరంలో నిద్రపోతున్న సుదర్శనుణ్ణి చూసి, పోయి రాజుగారితో చెప్పారు. రాజు కంగారు పడి అతన్ని పిలిపించాడు. రాజుగారికి జరిగినదంతా చెప్పి, సుదర్శనుడు తాను కోసుకువచ్చిన శవాల ముక్కులనూ, సన్యాసివాడి అవాలనూ చూపాడు. అతని మాటలను చక్రధరుడు వచ్చి రుజువు చేశాడు, శ్మశానంలో



ముక్కులు లేని శవాలు కూడా రుజువు చేశాయి, కాళిగుడిలో సన్యాసివాడి శవం కూడా రుజువు చేసింది. ఇన్ని రుజువులూ అయాక రాజు తన కుమార్తె ప్రాణాలు కాపాడిన సుదర్శనుడికి ఆ కుమార్తెనే ఇచ్చి పెళ్ళిచేసి, రాజోపచారంగా అతణ్ణి తన ఇంటనే ఉంచుకున్నాడు.

కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాటి రాత్రి రాజకుమార్తె, ఎవరో జ్ఞాపకం చేసినట్టుగా, సుదర్శనుడితో, "ఆనాడు కాళికాలయంలో ఆకాశవాణి మిమ్మల్ని నెల తీరగానే రమ్మన్నది. ఇవాళతో నెల తీరింది. మీరు మరిచిపోయారు," అన్నది.



"ఔను, బాగా జ్ఞాపకం చేశావు," అని సుదర్శనుడు తన భార్య నిద్రపోయాక, అగ్నేయఖడ్గం చేతబట్టుకుని, కాళికాలయం దగ్గిరికి వెళ్ళి చూసేసరికి, అక్కడ ఒక దివ్యభవనం కనిపించింది. అందులో ఒక దేవతా స్త్రీ ఉన్నది. ఆమె అతన్ని ఎంతో ప్రేమగా పిలిచి, కూర్చొబెట్టి, "నేను విద్యాధరకన్యను. నా పేరు భద్ర. ఆనాడు నీ సత్త్వమూ, సాహసమూ నన్ను బలంగా ఆకర్షించాయి. అదృశ్యంగా ఉండి నిన్ను రమ్మన్నది నేనే. నా ప్రభావంచేతనే నీ భార్య నీకీ సంగతి జ్ఞాపకం చేసింది. నీ కోసమే ఇప్పుడు కాచుకుని ఉన్నాను. నన్ను పెళ్ళాడు," అన్నది.

సుదర్శనుడు ఒప్పుకున్నాడు. వారు గాంధర్వవివాహం చేసుకున్నారు. అతను ఆమెతో దివ్యభోగాలనుభవిస్తూ అక్కడే ఉండిపోయాడు. ఇలా కొంతకాలం జరిగాక ఒకనాడు భద్ర వద్దకు ఆమె చెలికత్తె ఒకతె వచ్చి, "మానవసంపర్కం పెట్టుకున్నావని విద్యాధరులకు నీ పైన కోపం వచ్చింది. వారు నీకు కీడు చెయ్యబోతున్నారు. నువ్విక్కడి నుంచి వెంటనే వెళ్ళి, తూర్పుసముద్రం అవతల ఉండే కార్కోటక నగరం దాటి, శీతోద అనే నది అవ



తల, ఉదయపర్వతం మీద ఉండే సిద్ధ క్షేత్రానికి వెళ్ళు. అక్కడికి విద్యాధరులు రాలేరు. నీ ప్రియుణ్ణి గురించి విచారించకు. అతను సమర్థుడు, ఏదో విధంగా నిన్ను చేరుకుంటాడు," అన్నది.

భద్ర భయపడి, తన చెలికత్తె చెప్పినట్టే చేయ నిశ్చయించింది. ఆమె సుదర్శనుడి మనస్సు నొచ్చుకోకుండా ఉన్న సంగతి చెప్పి, అతనికి తన ఉంగరం ఇచ్చి, తెల్లవారకముందే అదృశ్యమైపోయింది. ఆమెతో బాటు దివ్యభవనం కూడా అదృశ్యమయింది. సుదర్శనుడు తానున్నది కాళికాలయమని గుర్తించాడు.



అంతా స్వప్నంలాగుంది. అయినా అతను ఉదయపర్వతానికి వెళ్ళ నిశ్చయించాడు. తెల్లవారితే తనను ఎవరో ఒకరు చూసి గుర్తించి, రాజుగారికి అప్పగిస్తారు. రాజు తనను ఇల్లు దాటి పోనివ్వడు.

అందుచేత సుదర్శను డొక యుక్తి పన్నాడు. అతను తన బట్టలు చించుకుని, ఒంటి నిండా దుమ్ము చల్లుకుని, " భద్రా ! భద్రా !" అని అరుస్తూ, గుడి నుంచి బయలుదేరాడు. కొద్ది రోజులుగా అతనేమైనదీ తెలియక తహతహలాడుతున్న జనం అతన్ని చూసి, " అడుగో, సుదర్శనుడు !" అన్నారు. రాజుగారికి తెలిసింది. ఆయన స్వయంగా వచ్చి అతన్ని తీసుకుపోయాడు. ఎవరేమడిగినా అతను " భద్రా " అంటాడు. అతనికి పిచ్చి పట్టిందని అంతా అనుకున్నారు. నిర్బంధం చేస్తే ప్రాణానికే మోసం వస్తుందేమోనని అతన్ని స్వేచ్ఛగా వదిలేశారు. ఎక్కడెక్కడో తిరుగుతున్నట్టే ఉండి అతను భద్ర కోసం తూర్పు దిక్కుగా బయలుదేరాడు.

పోగాపోగా పౌండ్రవర్ధన పట్టణం వచ్చింది. రాత్రి బసకు అతను ఒక వృద్ధ బ్రాహ్మణి ఇంటికి వెళ్ళి, ఆ వృద్ధురాలి నుంచి ఒక వింత విషయం విన్నాడు. ఆ వూరి రాజుకు లేకలేక కూతురు పుట్టింది. రాజామెను ఒక రాజకుమారిడికిచ్చి పెళ్ళి చేశాడు. పెళ్ళినాటి రాత్రి పెళ్ళికొడుకు పడకగదిలోకి పోతూనే చచ్చాడు. తరవాత ఆమెను మరొక రాజు కిచ్చి పెళ్ళిచేస్తే అతనికీ అదే గతి పట్టింది. ఇలా ఎంత మంది చస్తారో చూస్తామని రాజు తన నగరంలో గల బ్రాహ్మణ, క్షత్రియ పురుషులను వంతు ప్రకారం రోజు కొకణ్ణి తెచ్చి తన కూతురికి నిర్బంధంగా పెళ్ళి చేస్తూ వస్తున్నాడు. పెళ్ళి చేసుకున్న ప్రతివాడూ చస్తున్నాడు. ఈ రాత్రి బ్రాహ్మణి కొడుకు వంతు. ఆమె పుట్టెడు శోకంలో ఉన్నది.





ఈ కథ విని సుదర్శనుడు, "అమ్మా, విచారించకు. నీ కొడుకు బదులు ఈ రాత్రి రాజకుమార్తె పడకటింట నేను ప్రవేశిస్తాను," అన్నాడు. రాజభటులు వృద్ధురాలి కొడుకు కోసం వచ్చినప్పుడు సుదర్శనుడు తానే వారి వెంట వెళ్ళాడు. అతను శయనమందిరం లోకి ఆగ్నేయఖడ్గం పట్టుకుని ప్రవేశించి, పెళ్ళికొడుకులను చంపుతున్న దెవరో తెలుసుకోవటానికి మేలుకుని ఉన్నాడు. కొద్ది సేపటికి గది వాకిలి దగ్గిర ఒక భయంకరాకారుడైన రాక్షసుడు ప్రత్యక్షమై, తన చేతిని గది లోకి చాచాడు. సుదర్శనుడు వాడి చేతిని ఒక్క వేటుతో తెగనరికాడు. రాక్షసుడు పారిపోయాడు.

రాజుగారు మర్నాడు చాలా సంతోషించి సుదర్శనుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు. సుదర్శనుడు కొత్త భార్యతో కొద్ది రోజులు సుఖంగా గడిపి, ఒక రాత్రి ఆమె నిద్రపోతున్న సమయంలో తిరిగి తన ప్రయాణం సాగించాడు. నడవగా, నడవగా తూర్పు సముద్ర తీరాన గల తామ్రలిప్తి నగరం వచ్చింది. అక్కడ అతనికి స్కందదాసనే సముద్ర వర్తకుడు తటస్థపడ్డాడు. అతను సరుకులతో సహా ఓడలో సముద్రం అవతలి తీరానికి పోతున్నాడు. సుదర్శనుడు కూడా ఆ ఓడలో ఎక్కాడు. ప్రయాణ మధ్యంలో ఓడ దేనికో తగులుకున్నట్టుగా నిలిచిపోయి, సముద్రుడికి రత్న నైవేద్యం పెట్టినా కదిలిందికాదు. స్కందదాసు బెదిరిపోయి, "ఈ ఓడను కదిలించిన వాళ్ళకు నా ధనంలో సగమిచ్చి, నా కూతురి నిచ్చి పెళ్ళి కూడా చేస్తాను," అన్నాడు.

ఆ మాట విని సుదర్శనుడు, "నన్ను తాళ్ళతో సముద్రం లోకి దింపండి. ఓడ అడుగున అడ్డు తగిలిన దేమిటో చూసి, దాన్ని తొలగించి చూస్తాను," అన్నాడు.

అతన్ని తాళ్ళు కట్టి సముద్రంలో దింపారు. సుదర్శనుడు ఓడ దిగువకు వెళ్ళి

చూస్తే, నీటిలో ఒక మహాకాయుడు పడుకుని నిద్రపోతున్నాడు. ఓడ అతని పిక్క తగిలి నిలిచి పోయింది. సుదర్శనుడు ఆగ్నేయఖడ్గంతో ఆ మహాకాయుడి పిక్కను ఒక్క వేటుతో ఛేదించే సరికి ఓడ కదిలింది. ఓడ లోకి ఎక్కనిస్తే అన్నమాట ప్రకారం తన సంపదలో సగం ఇవ్వవలిసి వస్తుందని, లోభి అయిన స్కందదాసు, తాళ్ళు కోసేసి, సుదర్శనుణ్ణి సముద్రంలో వదిలేసి, ఓడ నడుపుకు పోయాడు.

సుదర్శనుడు తాను ఖండించిన పిక్కనే తెప్పగా చేసుకుని, ఎలాగో సముద్రం దాటగలిగాడు.

అతను అగ్నిహోత్రుడికి ప్రణామం చెప్పుకుని బయలుదేరి, ఏడు రోజులకు కార్కోటక నగరం చేరాడు. అక్కడ పరదేశీయుల కని ఒక మఠం ఉన్నది. అది అక్కడి రాజు ఆర్యవర్మ కట్టించినది. మఠంలో ఉండే బ్రాహ్మణులు సుదర్శనుడికి స్నానపానాలు అమర్చి, బట్టలు కూడా ఇచ్చారు. అతను ఆ మఠంలో ఉండగా సాయంకాలం పూట ఇలా చాటింపు వినపడింది: "రేపు ఉదయం రాజకుమార్తెను పెళ్ళాడగోరే బ్రాహ్మణుడు గాని, క్షత్రియుడు గాని, ఈ రాత్రి ఆమె ఉండే మందిరంలో పడుకోవాలి."





ఇదేమిటని అక్కడి వాళ్ళ నడిగితే, "అది రాజకుమార్తె మందిరమా? మృత్యుదేవత నోరు! అందులో ప్రవేశించి ప్రాణాలతో బయటికి వచ్చినవాడు లేడు. ఎందరో సాహసికులు అక్కడ బలి అయిపోయారు," అని చెప్పారు.

ఆ మాటలు విన్న మీదట మరింత సాహసం వచ్చి సుదర్శనుడు రాజగృహానికి వెళ్ళాడు. ఆర్యవర్మ అతనికి స్వయంగా స్వాగత మర్యాదలు చేశాడు. ఆ రాత్రి సుదర్శనుడు రాజకుమార్తె గదిలోకి వెళ్ళి, ఆగ్నేయ ఖడ్గం చేతబట్టి, కాగలదానికి ఎదురుచూడ సాగాడు. అంతలో ద్వారం వద్ద ఒక ఘోరరాక్షసాకారం కనిపించింది. ఆ రాక్షసుడికి కుడిచెయ్యి లేదు. వాడు తన ఎడమ చేతిని గదిలోకి ప్రవేశపెట్టాడు. పౌండ్రవర్ధన పట్టణంలో తాను చెయ్యి తెగకొట్టినది వీడినేనని గ్రహించి, ఈ సారి కూడా చెయ్యి నరికితే వాడు మళ్ళీ పారిపోతాడనుకుని, వాణ్ణి చంపే ఉద్దేశంతో సుదర్శనుడు వాడి పైకి లంఘించి, వాడి జుట్టు పట్టుకుని వంచి, చంపబోయాడు.

రాక్షసుడు భయపడి, "బాబూ, నన్ను చంపకు! రక్షించు!" అన్నాడు.

"నీ పేరేమిటి? ఎందుకిలా చేస్తున్నావు?" అని సుదర్శను డడిగాడు.



"నా పేరు యమదంష్ట్రుడు. నా కిద్దరు కుమార్తెలు. ఇక్కడ వున్నది ఒకతే, పౌండ్రవర్ధనంలో ఉండేది మరొకతే. వీళ్ళను పిరికివెధవలు పెళ్ళాడటం ఇష్టం లేక, శంకరుడి ఆజ్ఞ పొంది, వీళ్ళను పెళ్ళాడతామని వచ్చేవాళ్ళను చంపేస్తున్నాను. పౌండ్రవర్ధనంలో ఒకడు నా చెయ్యి తెగవేశాడు. ఇక్కడ నువు నన్ను చంపబోయావు. శంకరుడి ఆజ్ఞ తీరిపోయింది," అన్నాడు రాక్షసుడు.

సుదర్శనుడు నవ్వి, "ఒరే, పౌండ్రవర్ధనంలో నీ చెయ్యి నరికింది నేనే రా!" అని చెప్పాడు.

"అయితే నువు మనిషివి కావు, దేవతవు. నీ కోసమే శంకరుడి ఆజ్ఞ అయిందనుకుంటాను. ఇక మనం స్నేహితులం. నీ కే కష్టం వచ్చినా నన్ను తలుచుకున్నావంటే వచ్చి వాలుతాను," అని చెప్పి యమదంష్ట్రుడు సుదర్శనుడి వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు. రాజకుమార్తె సుదర్శనుడి పరాక్రమాన్ని పొగడి, ఆ రాత్రి అతనితో గడిపింది. మర్నాడు రాజు వారిద్దరికీ వివాహం చేసేశాడు.

సుదర్శనుడా కొత్త భార్యతో కొన్ని రోజులు గడిపి, ఒక రాత్రి ఆమె నిద్రపోతున్న సమయంలో, భద్రను వెతు

క్కుంటూ మళ్ళీ బయలుదేరాడు. అతను నగరం వెలపలకు చేరి యమదంష్ట్రుణ్ణి తలచుకునే సరికి వాడు వచ్చి, నమస్కారం చేసి నిలబడ్డాడు.

వాడితో సుదర్శనుడు, "ఏమోయి, భద్ర అనే విద్యాధరి ఉదయాద్రి మీద సిద్ధక్షేత్రంలో ఉన్నది. నే నక్కడికి వెళ్ళాలి. తీసుకుపోతావా?" అన్నాడు.

రాక్షసుడు అలాగేనని, సుదర్శనుణ్ణి తన భుజాల మీద ఎక్కించుకుని, తెల్లవారే లోపుగా అరవై యోజనాలు ప్రయాణించి, శీతోదా నదికి ఇంకా తూర్పుగా ఉన్న ఉదయపర్వతం వద్దకు చేర్చి, సిద్ధులుండే ఆ పర్వతాన్ని ఎక్కే అధికారం తనకు లేదని సెలవు పుచ్చుకున్నాడు.

ఆ పర్వతాన్ని మానవులు కూడా ఎక్కరాదు. అందుచేత సుదర్శనుడు ఒక దిగుడుబావి దగ్గిర కూర్చుని, ఆ ప్రదేశంలో ఆడవాళ్ళ అడుగుజాడ లుండటం గమనించాడు. అతను చూస్తుండగానే అక్కడికి అనేక మంది దేవతాస్త్రీలు బిందెలతో వచ్చి, నీళ్ళు ముంచుకున్నారు.

"ఈ నీళ్ళన్నీ ఎవరి కోసం తీసుకుపోతున్నారు?" అని అత నడిగాడు.

"భద్ర అనే విద్యాధరి ఇక్కడ ఉంటున్నది. ఆమె స్నానానికని నీరు పట్టుకు





పోతున్నాం," అని వారు జవాబు చెప్పారు. వారిలో ఒకతె అతన్ని, "ఈ బిందె కాస్త ఎత్తి పెడతావా?" అని అడిగింది. సుదర్శనుడు బిందెను ఎత్తుతూ, భద్ర తన కిచ్చిన ఉంగరాన్ని ఆ బిందెలో చల్లగా జార విడిచాడు. స్త్రీలు వెళ్ళిపోయారు.

భద్రకు వారు స్నానం చేయించేటప్పుడు ఒక బిందె నుంచి ఆ ఉంగరం ఆమె మీద పడింది. అది తాను తన ప్రియుడి కిచ్చిన ఉంగరమని గుర్తించి పట్టరాని సంతోషం పొందుతూ ఆమె వారిని, "బావి వద్ద కొత్త పురుషు డెవరైనా కనిపించాడా?" అని అడిగింది. కనిపించాడనీ, ఒకతెకు బిందె ఎత్తి సహాయం కూడా చేశాడనీ వారు ఆమెకు చెప్పారు.

"అతనికి చక్కగా స్నానం చేయించి, అలంకరించి తీసుకురండి," అని భద్ర వారితో చెప్పింది. కొంచెం సేపటికి ఆ స్త్రీలు సుదర్శనుణ్ణి అలంకరించి తెచ్చారు. భద్ర ఆనందబాష్పాలు రాలుస్తూ, అతన్ని గట్టిగా కౌగలించుకున్నది. ఆమెను చేరటానికి తాను పడినపాట్లన్నీ సుదర్శనుడు చెప్పాడు. భద్ర పొంగిపొర్లే ప్రేమతో, "నాకీ పరిచారికలు వద్దు, సిద్ధులూ వద్దు, నా పంచప్రాణాలూ నువే," అన్నది.



"అలా అయితే ఈ దివ్యభోగాలు వదులుకుని నాతో ఉజ్జయినికి వస్తావా?" అని సుదర్శను డడిగాడు. తప్పకుండా వస్తానని చెప్పి, భద్ర తన విద్యాధరత్వాన్నీ, విద్యలనూ వదిలేసింది.

సుదర్శనుడు ఆ రాత్రి ఉదయపర్వతం మీదనే గడిపి, మర్నాడు రాక్షసుణ్ణి తలుచుకుని, అతను రాగానే అతని భుజాల మీద తానెక్కి, భద్రను కూడా ఎక్కించి, కార్కోటక నగరం చేరాడు. అక్కడివాళ్ళు రాక్షసుణ్ణి చూసి భయభ్రాంతులయారు. సుదర్శనుడు ఆర్యవర్మ కుమార్తెను కూడా తన వెంట తీసుకుని, ఓడ వర్తకుడైన

స్కందదాసుండే ఊరికి వెళ్ళి, అతను చేసిన ద్రోహానికి శిక్షగా, అతని ధనాన్నీ, కుమార్తెనూ కూడా పుచ్చుకుని, ముగ్గురు స్త్రీలనూ తనతోబాటు రాక్షసుడి పైన ఎక్కించుకుని, సముద్రం దాటి పౌండ్ర వర్ధనానికి వచ్చాడు. ఎంతో కాలంగా అతని జాడ తెలియక అలమటిస్తున్న అతని భార్యా, మామగారూ అతన్ని చూసి చాలా సంతోషించారు.

వాళ్ళు కొంతకాలం ఉండి వెళ్ళమని ఎంత బతిమాలినా వినక, సుదర్శనుడు పౌండ్రవర్ధన రాజకుమార్తెను కూడా వెంటబెట్టుకుని రాక్షస వాహనం మీద ఉజ్జయిని చేరాడు.

నలుగురు ఆడవాళ్ళనూ, సుదర్శనుణ్ణీ మోసుకువస్తున్న రాక్షసుణ్ణి చూసి ఉజ్జయినీ పౌరులు భయమూ, ఆశ్చర్యమూ పొందారు. ఆదిత్యసేన మహారాజు తన అల్లుడి రాక విని ఎదురు వచ్చాడు. రాజును చూడగానే సుదర్శనుడు రాక్షసుడి భుజం మీది నుంచి దిగి, ప్రణామం చేశాడు. రాజు పరమానందం చెందాడు. సుదర్శనుడు రాక్షసుడి మీది నుంచి తన భార్యలందరినీ దింపి, వెళ్ళటానికి అనుమతి ఇచ్చి, రాక్షసుణ్ణి పంపేశాడు.

తరవాత అందరూ కలిసి రాజభవనానికి వెళ్ళారు. తన భర్త తిరిగి కనిపించడని నిరాశచేసుకుని, కృశించి ఉన్న చంద్రకళ తిరిగి తన భర్తను చూసి అపరిమితానంద భరితురాలయింది.

"ఈ రాక్షసుడెక్కడ దొరికాడు? ఈ భార్యలందరినీ ఎలా సంపాదించావు?" అని మామగారడగగా సుదర్శనుడు జరిగినదంతా చెప్పాడు. అతని అద్భుత శక్తికీ, పరాక్రమానికీ రాజు సంతోషించి, తన అల్లుడి ప్రతాపానికి తగినట్టుగా అర్ధరాజ్యం ఇచ్చి, రాజ్యాభిషేకోత్సవం మహా వైభవంగా జరిపించాడు.






# అప్పూ-వడ్డీ

పాపన్న ఉండే గ్రామంలో ఒక కిరాణా కొట్టు పెట్టాలని, పక్క గ్రామంలో ఉండే గోవిందు డనే యువకుడు కొంత డబ్బు పోగు చేశాడు. కాని వాడి కింకా ఒక వంద రూపాయలు కావలసివచ్చింది. తన సొంత గ్రామంలో వాడి కా డబ్బు పుట్టలేదు. అప్పుడు వాడి స్నేహితు డొకడు, "ఎందుకు శ్రమపడతావు ? నువు కొట్టు పెట్టదలచిన గ్రామంలోనే పరోపకారి పాపన్న ఉన్నాడు. ఆయన దగ్గిర డబ్బుంటుంది. ఎందుకంటే, ఈ మధ్యనే ఆయన కెవరో సన్మానం చేశారు. ఆయన డబ్బడిగితే లేదనడు. తిరిగి ఇవ్వకపోయినా విచారించే మనిషి కాడు," అని సలహా ఇచ్చాడు. గోవిందుడికి ఈ సలహా దివ్యంగా తోచింది. వాడు పాపన్న వద్దకు వచ్చి, తన డబ్బు చిక్కు గురించి చెప్పుకుని, వంద రూపాయ లడిగాడు.

"దానంగా కావాలా, అప్పుగా కావాలా?" అని పాపన్న అడిగాడు.

పాపన్న ఇలా అడగటం చూసి గోవిందుడు నిర్ఘాంతపోయాడు. జరిగిన దేమిటంటే, ఇటీవలనే పాపన్న తన గురువు గారిని కలుసుకోవటం జరిగింది. ఆ సందర్భంలో గురువుగారు పాపన్న వ్యవహారాలన్నీ తెలుసుకుని, "చూడు, పాపన్నా, నువు దానధర్మాలు చేసేటప్పుడు పాత్రాపాత్ర విచక్షణ అవలంబించాలి. అసహాయులకు ధర్మం చెయ్యవచ్చు. నిస్సహాయులు కానివారికి డబ్బు అప్పు ఇవ్వటం కూడా సహాయమే. ఆ అప్పు తిరిగి పుచ్చుకోక పోతే సొమ్ము తిన్నవాడి పాపంలో ఇచ్చిన వాడు భాగస్తు డవుతాడు," అని బోధచేశాడు.

ఈ బోధ మనసులో పెట్టుకునే పాపన్న ఆ విధంగా అడిగాడు.







కుని వెళ్ళిపోయాడు. తాను గోవిందుడికి నూరురూపాయలు అప్పిచ్చిన సంగతి పాపన్న గుర్తు రాసుకున్నాడు.

గోవిందుడు పెట్టిన గడువు మూడు నెలలూ గడిచాయి. ఈ లోపుగా పాపన్న ఎంతమందికో దానధర్మాలు చేసినట్టు వాడు తెలుసుకుని, "నా దగ్గిర గొప్ప వ్యవహర్త లాగా మాట్లాడాలని చూశాడు గాని, ఆ మనిషి నా బాకీ మాట మరి ఎత్తడు," అనుకుని తృప్తిపడ్డాడు.

పాపన్న ఒక సంవత్సరమల్లా ఆగి, గోవిందుడి వద్దకు వెళ్ళి, "ఏమోయి, నా దగ్గర ఏడాది క్రితం నూరు రూపాయలు అప్పు తీసుకున్నావు, మూడు నెలల్లో చెల్లు వేస్తానన్నావు, ఇంతవరకు చెల్లించనే లేదు. నీ వ్యాపారం బాగా సాగుతున్నదా?" అని అడిగాడు.

"వ్యాపారం బాగానే జరుగుతున్నది కానీండి, డబ్బు పార్లించవలిసి రావటంతో మీ బాకీ తీర్చలేకపోయాను. వీలు చూసుకుని ఇస్తాలెండి," అన్నాడు గోవిందుడు.

"ఇవ్వలేకపోతే చెప్పెయ్యి. దానం చేశాననుకుంటాను," అన్నాడు పాపన్న.

నలుగురు బేరగాళ్ళు దుకాణంలో ఉన్న సమయంలో ఇంత మాట పడలేక గోవిం

గోవిందుడు అభిమానంతో, "దానం పట్టే కర్మ నాకేం పట్టిందండీ? అప్పుగానే ఇవ్వండి. మూడు నెలలలో మీ బాకీ అంతా సర్దేస్తాను. వడ్డీ ఎంత అడుగుతారో అడగండి," అన్నాడు.

"మూడు నెలల భాగ్యానికి వడ్డీ దేనికి? అసలు ఇచ్చేస్తే చాలు," అన్నాడు పాపన్న.

"పత్రం రాసి ఇవ్వమన్నారా?" అని అడిగాడు గోవిందుడు.

"నీలో నీకు విశ్వాసం లేకపోతే రాసి ఇవ్వు," అన్నాడు పాపన్న.

"నా విశ్వాసం మీరే చూస్తారుగా!" అని గోవిందుడు నూరురూపాయలు పుచ్చు



దుడు, "ఛ, ఛ! దానం దేనికండీ? అప్పు అన్న తరవాత అప్పే! ఇచ్చేస్తాను," అని పాపన్నను అవతలికి తీసుకుపోయి రహస్యంగా, "చూడండి పాపన్నగారూ, బాకీ అంతా ఒక్కసారిగా ఇవ్వటం నాకూ కష్టం గానే ఉంది. నెలకు పదేసి రూపాయల చొప్పున చెల్లువేస్తాను. ఏమంటారు?" అని అడిగాడు.

పాపన్న సరే నన్నాడు. గోవిందుడు పాపన్నకు పది రూపాయ లిచ్చి పంపేశాడు. అది మొదలు వాడు పాపన్నకు నెల నెలా పదేసి రూపాయల చొప్పున ఇస్తూ వచ్చాడు.

తీర్చనవసరం లేదనుకున్న అప్పు వాయిదాల మీదనే అయినా తీర్చవలసి వచ్చేసరికి గోవిందుడికి పాపన్న పైన ఏదో కసి పుట్టుకొచ్చింది. అందుచేత వాడు పాపన్న పైన దుష్ప్రచారం ప్రారంభించాడు. పాపన్న నెలనెలా వచ్చి పదేసి రూపాయలు పుచ్చుకుపోయినప్పుడల్లా దుకాణం మీద ఎవరో ఉండేవాళ్ళు. వాళ్ళతో గోవిందుడు, "ఈ పెద్దమనిషి, చూడండి, అపరదాన కర్ణుడని అంతా చెప్పుకుంటారు. తప్పని సరి అయి ఈయనగారి దగ్గిర ఒక వంద రూపాయలు అప్పు చేశాను. అందుకుగాను నెలకు పది రూపాయలు వడ్డీ గూబలు






మెలేసి తీసుకుంటున్నాడు. చచ్చినట్టు ఇచ్చుకుంటున్నాను. ఏమిటి చెయ్యటం?" అంటూ వచ్చాడు.

ఈ దుష్ప్రచారం విని అంతా ఆశ్చర్య పడ్డారు, పాపన్న పైన అభిమానం గల వాళ్ళు బాధ పడ్డారు కూడా. ఇలాటి అభిమానులలో రామయ్యశ్రేష్ఠి అనే ఆయన ఒకడు. ఆయనతో కూడా గోవిందుడు పాపన్న గురించి అందరి తోనూ అన్నట్టే అన్నాడు. అది విని రామయ్యశ్రేష్ఠి మండి పడి గోవిందుణ్ణి గట్టిగా చివాట్లు వేశాడు.

"పాపన్నగారికి వల్లమాలిన వడ్డీ చెల్లించ లేక నేను ఎలా సతమతమవుతున్నానో మీకు తెలీదు, శ్రేష్ఠిగారూ. ఈ బాకీ రద్ద యితేనేగాని నాకు నిద్రాహారాలుండవు. నా భార్య చేతినగలు అమ్మి పాపన్నగారి నుంచి ఋణవిముక్తి పొందుదామను కుంటున్నాను. కాస్త వాటిని మంచి ధరకు అమ్మిపెట్టి పుణ్యం కట్టుకోండి," అంటూ గోవిందుడు తన భార్య చేతినగలు తెచ్చి రామయ్యశ్రేష్ఠి కిచ్చాడు.

అసలు సంగతేమిటంటే, గోవిందుడి వ్యాపారం మూడు పూలూ, ఆరు కాయలుగా ఉంది, పెట్టుబడి హెచ్చిస్తే లాభాలింకా హెచ్చే సూచనలు కనబడుతున్నాయి. అందుచేత వాడు తన భార్య నగలు ఎలాగూ అమ్మ దలిచాడు. అవి రామయ్యశ్రేష్ఠిగారి చేతిలోనే పెట్టి, పాపన్న బాకీ కోసం అమ్ముతున్నట్టు చెబితే, ఆయనకు తన మాటలలో విశ్వాసం కుదురుతుందన్న నమ్మకంతో ఈ పని చేశాడు.

రామయ్యశ్రేష్ఠికి గోవిందుడి మాటలలో కొంత నమ్మకం కుదరనే కుదిరింది. అంత మాత్రాన ఆయనకు పాపన్నయందున్న గురి పూర్తిగా నశించక, పాపన్న వద్దకు వెళ్ళి గోవిందుడి బాకీ గురించి అడిగాడు.

"మూడు నెల్లలో తీరుస్తానని గోవిందుడు నా దగ్గిర నూరు రూపాయలు పుచ్చు

కున్నాడు. ఏడాదిపాటు ఒక్క రూపాయి కూడా చెల్లు వెయ్యలేదు. ఆ తరవాత నేను వెళ్ళి, బాకీ తీర్చుతావా, ధర్మం కింద ఉంచుకుంటావా అని అడిగితే, నెలకు పది రూపాయల చొప్పున చెల్లు వేస్తానని తొమ్మిది మాసాలలో తొంభై రూపాయలు చెల్లు వేశాడు. ఇంకొక్క పది రూపాయలిస్తే నా బాకీ తీరిపోతుంది. వడ్డీ ప్రసక్తే లేదు," అని పాపన్న చెప్పాడు.

గోవిందుడు యుక్తిగా అబద్ధమాడి తనను మోసగించినందుకు రామయ్యశ్రేష్ఠికి చాలా కోపం వచ్చింది. అయన పాపన్నతో, "పాపన్నగారూ, రేపు ఉదయం సరిగా పది కొట్టే సరికి గోవిందుడి దుకాణానికి తప్పక రావాలి. వాడు మీ బాకీ సాంతం తీర్చేస్తాడు," అన్నాడు.

రామయ్యశ్రేష్ఠి ఇలా ఎందుకన్నాడో పాపన్నకు అర్థం కాలేదు, కాని అయన మీది గౌరవం కొద్దీ అలాగే వస్తానన్నాడు.

మర్నాడు పది గంటలు కొట్టటానికింకా కొద్ది వ్యవధి ఉన్నదనగా రామయ్యశ్రేష్ఠి రూపాయలు మూట కట్టుకుని, ఒకరిద్దరు ఊరిపెద్దలను వెంటపెట్టుకుని గోవిందుడి దుకాణానికి వచ్చి, గోవిందుడితో, "ఇదుగో, నువ్విచ్చిన నగలు అమ్మగా వచ్చిన డబ్బు. మంచి ధరకే అమ్మాను. దీంతో పాపన్న



గారి అసలు ఫాయిధాలూ చెల్లించి, ఋణ విముక్తుడివై, ఇకమీదట నిశ్చింతగా ఉండు," అన్నాడు.

అంతలోనే పాపన్న అక్కడికి రానే వచ్చాడు. రామయ్యశ్రేష్ఠి అతనితో, "దయ చెయ్యండి, పాపన్నగారూ. మీ గురించే అనుకుంటున్నాం. పాపం, గోవిందుడు మీ బాకీ చెల్లించటం కోసం భార్య నగలు కూడా అమ్మి డబ్బు సేకరించి, ఋణ విముక్తి పొందగోరుతున్నాడు. చిన్న వ్యాపారస్తుడు కావటంచేత భారీ వడ్డీ ఇచ్చుకోలేక సతమతమయాడు. ఇదుగో మీకు ఈ నెల రావలిసిన వడ్డీ పది రూపాయలూ, మీ రిచ్చిన అసలు నూరురూపాయలూ కలిసి నూటపది రూపాయలు," అంటూ పాపన్నకు నూటపది రూపాయలివ్వబోయాడు.

పాపన్న ఆశ్చర్యపోతూ, "అదేమిటి, శ్రేష్ఠిగారూ? గోవిందుడు నా దగ్గిర తీసుకున్నదే నూరు రూపాయలు. అంతా ఒక్క సారిగా ఇచ్చుకోలేనని, నెలకు పది చొప్పున తొమ్మిది మాసాలుగా ఇస్తూ వస్తున్నాడు. ఇంక నాకు రావలిసినది పదే. పైన ఈ నూరు ఏమిటి?" అన్నాడు.

ఈ సంగతి శ్రేష్ఠికి తెలుసుగాని, అతని వెంట వచ్చిన పెద్దలకు తెలీదు. వాళ్ళు కూడా, పాపన్న గోవిందుడి వద్ద వడ్డీ గుంజుతున్నాడనే అనుకున్నారు. గోవిందుడు ఇంత కాలంగా చేసిన నీచప్రచారం వాళ్ళ కిప్పుడీర్థమయింది. వాళ్ళు గోవిందుణ్ణి నానా మాటలూ అన్నారు.

పాపన్న ఆ గొడవ పట్టించుకోకుండా తనకు రావలిసిన పది రూపాయలూ తీసుకుని వెళ్ళిపోయాడు.

గోవిందుడు పాపన్న మీద నీచప్రచారం చేసినట్టు కొద్దిసేపట్లోనే ఊరంతా తెలిసిపోయింది. అతని వ్యాపారం కూడా ఆనాటి నుంచీ దెబ్బ తిన్నది.





# రాజకుమార్తె నవ్వింది

ఒక రాజు కొక అందాల కూతు రుండేది. అమె అందం గురించి పన్నెండు దేశాలలో చెప్పుకున్నారు. అనేక మంది రాజకుమారులామెను పెళ్ళాడతామని వచ్చారు. ఆమె వారిలో ఒక్కరిని కూడా చూడనైనా లేదు. అసలు సంగతేమిటంటే, ఈ అందాల రాజకుమార్తెకు మనుషులంటే పరమ అసహ్యం. దానికి తోడు ఆమె ఎన్నడూ నవ్వదు, ఆఖరుకు ఆమె ముఖాన చిన్న చిరునవ్వు కూడా ఎన్నడూ రాలేదు.

ఎంతేసి గొప్ప రాజకుమారులనూ, అందగాళ్ళనూ తన కుమార్తె నిరాకరించటం చూసి రాజు విసిగిపోయి, తన కుమార్తెను ఎవరు నవ్విస్తే వారి కామె నిచ్చి పెళ్ళి చేసి, అర్ధరాజ్యం కూడా ఇస్తానని చాటింపు వేయించాడు. ఆ చాటింపు విని రకరకాల హాస్యగాళ్ళూ, విదూషకులూ, ఇతరులూ నాలుగు దిక్కుల నుంచీ తండోపతండాలుగా వచ్చి, రాజకుమార్తెను నవ్వించటానికి పడరాని పాట్లన్నీ పడ్డారు. కాని వాళ్ళ శ్రమ యావత్తూ వృథా అయింది. రాజకుమార్తె నవ్వనే లేదు.

రాజుగారి ఇంటికి సమీపంలోనే ఒక కాపు నివసిస్తున్నాడు. ఆ కాపుకు ముగ్గురు కొడుకు లున్నారు. అతను తన పెద్ద కొడుకును పిలిచి, "ఒరే, నిన్ను చూసి అందరూ తెగ నవ్వుతారు. రాజుగారింటికి వెళ్ళి, రాజకుమార్తెను నవ్వించావంటే మన పంట పండిందన్నమాటే!" అన్నాడు.

కాపు పెద్ద కొడుకు రాజుగారి వద్దకు వెళ్ళి, రాజకుమార్తెను నవ్విస్తా నన్నాడు. రాజుగారికి ఏ మాత్రమూ నమ్మకం చిక్క లేదు. అయినా ప్రయత్నించమన్నాడు. కాపు పెద్ద కొడుకు రాజకుమార్తెను నవ్విం

బి. నాగేశ్వరరావు








వాడు కూడా కొరడాదెబ్బలు తిని ఇంటికి వచ్చేశాడు.

ఆ తరవాత కాపు మూడో కొడుకు సంగడు తాను పోతానన్నాడు. వాడికి మామూలు తెలివితేటలు కూడా లేవు, బొత్తిగా ఏ పనీ చెయ్యలేడు. అందుచేత తండ్రి ఒప్పుకోలేదు. కాని సంగడు కాదు కూడదు వెళ్ళితీరాలని బయలుదేరాడు.

వాడు రాజభవనానికి వెళ్ళి, "నేను రాజకుమార్తెను నవ్విస్తాను," అని అందరూ అన్నట్టు అనక, తన కేదైనా పని కావాలని అడిగాడు. వాడికి నది నుంచి కావడితో నీళ్ళు చేరవేసే పని ఇచ్చారు.

చటానికి ప్రయత్నించి, ఓడిపోయినందుకు శిక్షగా మూడు కొరడాదెబ్బలు తిని ఇంటికి చేరుకున్నాడు.

వెంటనే కాపు రెండో కొడుకు తాను ప్రయత్నిస్తా నన్నాడు. వాడు చూడటానికే నవ్వు వచ్చేటట్టుంటాడు. వాడికి ఒక కాలు పొట్టీ, మరొక కాలు పొడుగూనూ. అందు చేత వాడు కాలు తీసి కాలు వేసినప్పుడల్లా దిబ్బ ఎక్కి దిగుతున్నట్టుంటాడు. దానికి తోడు వాడు మాటకారి. అందుచేత తండ్రి వాణ్ణి కూడా రాజభవనానికి వెళ్ళనిచ్చాడు. అయితే వాడి అవతారమూ, మాటకారి తనమూ రాజకుమార్తె మీద పారలేదు.

ఒకనాడు వాడు నదిలో బిందె ముంచే సరికి ఒక పెద్ద చేప బిందెలోకి వచ్చింది. వాడు కావడి ఎత్తుకుని తిరిగి వస్తుండగా, ఒక ముసలిది ఒక పెద్ద బాతును వెంట పెట్టుకుని వస్తూ ఎదురుపడింది. ఆ బాతు మేలిమిబంగారు రంగులో ఎంతో చూడ ముచ్చటగా ఉన్నది.

సంగ డామెను పలకరించి, "ఎంత అందమైన బాతు! దాన్ని నా కియ్యరాదా, అవ్వా?" అన్నాడు.

అవ్వ బిందెలో ఉన్న చేపను చూసి, "ఆ చేప నిచ్చి బాతును తీసుకో," అన్నది.



సంగడు సంతోషంగా ఒప్పుకున్నాడు. అవ్వ చేపను తీసుకుని బాతును సంగడి కిస్తూ, "ఈ బాతు మామూలు బాతు కాదు. దీన్ని ఎవరైనా తాకినప్పుడు, 'అంటుకుని వెంటరా!' అన్నావంటే ఆ మనిషి బాతుకు అంటిల్లా అయిపోయి, తప్పించుకోలేడు," అని రహస్యంగా చెప్పింది.

"మరీ మంచిది. అలాటి బాతుంటే అంతులేని చేపలు పట్టవచ్చు," అని సంగడు బాతును తీసుకుని బయలుదేరాడు. దారిలో వాడికి మరొక ముసలిది కనిపించి, "ఎంత చక్కని బాతో! ఒక్కసారి దాన్ని నిమరనిస్తావా, బాబూ?" అన్నది.

"నిమురు గాని, ఈకలు లాగమాక!" అన్నాడు సంగడు. ముసలిది బాతు మీద చెయ్యి వేసి నిమర నారంభించగానే వాడు, "అంటుకుని వెంటరా!" అన్నాడు. వెంటనే ముసలిదాని చేతులు బాతుకు అంటుకుపోయాయి. సంగడు బాతుతో సహా ముందుకు సాగాడు. ముసలిది విధిలేక వెంట నడిచింది.

వాళ్ళు అలా కొంత దూరం వెళ్ళేసరికి ముసలిదాని చేత మోసపోయిన ఒకడు దాన్ని చూసి, కసికొద్దీ కాలెత్తి ఒక్క తన్ను తన్నాడు. ఆ క్షణంలో సంగడు, "అంటుకుని వెంటరా!" అన్నాడు. ఆ మనిషి కాలు



ముసలిదానికి అంటుకుపోవటం చేత, వాడు ఒంటికాలు మీద గెంతుతూ తాను కూడా నడవసాగాడు.

వాళ్ళు అలాగే రాచనగరు ప్రవేశించారు. అక్కడ ఒక కమ్మరి ఈ దృశ్యం చూసి, గెంతుతున్న మనిషిని గుర్తించి, వాడికి సహాయం చేద్దామని వెనక నుంచి పట్టుకుని లాగాడు. "అంటుకుని వెంటరా!" అన్నాడు సంగడు. కమ్మరి కూడా బారులో చేరిపోయాడు.

ఇలా వాళ్ళు రాజభవనం వెనకభాగం చేరేసరికి బయటి కోలాహలం విని రాజుగారి వంటలక్క గరిటతో సహా బయటికి వచ్చి, సంగడి చేతిలో బాతును చూసి, "ఎంత అందమైన బాతో! ఒక్కసారి నిమరనిస్తావా, సంగడూ?" అన్నది.

అది విని కమ్మరి, "దాన్నేం నిమురుతావు? నన్ను నిమురు!" అన్నాడు పరాచకంగా.

"ఏమన్నావురా, కోతివెధవా!" అంటూ వంటలక్క గరిటె పెట్టి కమ్మరి నడుం మీద ఒక్కటి పెట్టింది.

"అంటుకుని వెంటరా!" అన్నాడు సంగడు. వంటలక్క గరిటెతో సహా బారులో చేరింది. ఇంత మందినీ రాజభవనం ముందుకు తీసుకుపోయి సంగడు, అక్కడ గుండ్రంగా నడిపించ సాగాడు. రాజుగారి కుక్కలు ఈ వింత దృశాన్ని చూసి మొరిగాయి. జనం పోగై కలకలం చెయ్యసాగారు. రాజుగారూ, రాజకుమార్తే, దాసీలూ మేడ మీది కిటికీల వద్దకు వచ్చి బయటికి చూశారు. రాజకుమార్తె కింది దృశ్యాన్ని చూసి విరగబడి నవ్వసాగింది. ఆమె పడిపోకుండా రాజుగారు పట్టుకోవలిసి వచ్చింది. రాజకుమార్తె ఇంత కాలానికి నవ్వటం వేలాది జనం చూశారు. రాజుగారామెను సంగడి కిచ్చి పెళ్ళి చేసి, అర్ధరాజ్యం కూడా ఇచ్చేశాడు.






# వీరాధి వీరుడు

ఒక గ్రామంలో ఒక చెప్పులు కుట్టేవాడుండేవాడు. వాడు యువకుడు, తెలివితేటలూ, ధైర్యసాహసాలూ గలవాడు. అయినా, వాడి తాతముత్తాతలు చెప్పులు కుట్టి బతకటం చేత వాడికి కూడా అదే వృత్తి అలపడింది. ఈగలు ముసిరే కొంపలో కూచుని తన జీవితమంతా చెప్పులు కుట్టుతూ, ఈగలను చంపుతూ వ్యర్థం చెయ్యటం వాడికి ఏమాత్రమూ నచ్చలేదు. విశాలమైన ప్రపంచం ఉన్నది. ఎక్కడికైనా వెళ్ళి అదృష్టదేవతను ఆరాధించవచ్చు.

ఈ మాట అనుకుని ఆ చెప్పులు కుట్టేవాడు తన పేరు రణసింహుడని మార్చుకుని, వీరోచితమైన దుస్తులూ, ఒక కత్తి సంపాదించి అదృష్టదేవతను వెతుక్కుంటూ బయలుదేరాడు. వెళ్ళగా వెళ్ళగా రాజధానీ నగరం వచ్చింది. రణసింహుడు తిన్నగా రాజుగారి భవనం ప్రవేశించి, రాజుగారి ఎదటికి వెళ్ళి, "మహారాజా, నా పేరు రణసింహుడు. నా శౌర్యానికీ, పరాక్రమానికీ అంతు లేదు. చిన్నతనం నుంచీ నేను ఎన్ని వేల ప్రాణాలు తీశానో లెక్కలేదు. నన్ను తమ కొలువులో పెట్టుకోండి," అన్నాడు.

రాజుగారు చెప్పులు కుట్టేవాణ్ణి ఎగాదిగా చూసి, "నిన్ను చూస్తే ఏమంత యోధుడివిలాగా కనిపించటంలేదు. అయినా నీ పరాక్రమం రుజువు చేస్తే నిన్ను కొలువులో పెట్టుకుంటాను. ఇక్కడికి సమీపాన ఉండే అరణ్యంలో ఒక నరభక్షకుడైన రాక్షసుడుంటున్నాడు. వాడు రోజూ ఒకరిద్దరిని చంపి తింటూ, దేశ ప్రజలకు మహాకంటకంగా ఉన్నాడు. వాణ్ణి చంపి రాగలవా?" అని ప్రశ్నించాడు.

ఎస్. గోవిందరాజు





"అదెంత పని? అలాటి సాహస కృత్యాలు చేసే అవకాశం కోసమే గదా నేను దేశాటన చేస్తున్నది?" అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

"ఆ రాక్షసుడి పైకి మన యోధుల్ని పంపాను, కాని ప్రయోజనం లేకపోయింది. వాడు వాళ్ళను చంపి తిన్నాడు. కనక ఆలోచించుకో," అన్నాడు రాజు.

"వాడి తల తెచ్చి తమ ముందుంచుతాను, సరా?" అన్నాడు చెప్పులు కుట్టేవాడు. అతను ఎంత ధైర్యసాహసాలు కలవాడైనా రాక్షసుడి సంగతి విని కొంచెం బెదిరాడు. అయితే అతనికి ఒకటే ధైర్యం: రాక్షసులకు శరీరబలం హెచ్చు గాని, బుద్ధి బలం చాలా తక్కువ. వాళ్ళకు ధైర్యం కూడా తక్కువే. అతను బియ్యం పిండిలో బూడిద కలిపి రాళ్ళ రూపంలో తయారు చేసి సంచీలో వేసుకుని అరణ్యం కేసి బయలుదేరాడు. పోగా పోగా అరణ్యంలో రాక్షసుడి ఇల్లు కనిపించింది. దానికి సమీపంలో ఉన్న ఎత్తయిన చెట్టు మీదికి ఎక్కి చెప్పులు కుట్టేవాడు, రాక్షసుడి కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

సూర్యాస్తమయం కాబోయే వేళ రాక్షసుడు వస్తున్న అలికిడి వినిపించింది. భూమి అదిరింది. రాక్షసుడు చెట్ల కొమ్మలను తోసుకుంటూ వస్తుంటే అవి పెళపెళా విరిగాయి. చెట్ల మీది పక్షులు భయంతో అరుస్తూ పారిపోయాయి. రాక్షసుడు, చెప్పులు కుట్టేవాడెక్కిన చెట్టును సమీపించి, గాలివాసన చూస్తూ, "నరవాసన!" అంటూ పైకి చూసేసరికి చెప్పులు కుట్టేవాడు కనిపించాడు.

"అక్కడ ఉన్నావా? దిగి రా, లేకపోతే చెట్టుతో బాటు నిన్ను కింద పడేస్తాను," అన్నాడు రాక్షసుడు.

"కాస్త గుర్రాన్ని కట్టెయ్యి, నేను దిగి రానూ వస్తాను, నీ అంతు తేల్చనూ

తెలుస్తాను. ప్రపంచంలో నన్ను మించిన బలాఢ్యుడు లేడు. నే నెవరనుకున్నావు? రణసింహుణ్ణి!" అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

"నేను నమ్మను," అన్నాడు రాక్షసుడు.

"నమ్మకపోతే కళ్ళారా చూడు. ఇవిగో, గండరాళ్ళు. వీటిని నేనేం చేస్తానో తెలుసా," అంటూ తన సంచీలో నుంచి ఒక్కొక్క రాయే తీసి విరిచి తుంపులు చేసి, దూరంగా పొదలలోకి పారెయ్యసాగాడు.

రాక్షసుడికి అనుమానం తీరకపోయినా, జంకు పుట్టింది. కొద్దిపాటి మనిషి అంతంత రాళ్ళను అలా తుంపులు తుంపులు చెయ్యటం అసాధ్యమే. కాని ఏ పుట్టలో ఏ పాముందో? అందుచేత ఈ రణసింహుడి విషయంలో కాస్త జాగ్రత్తగా ఉండటమే మంచి దనుకుని రాక్షసుడు, "నువు నిజంగా అంత బలవంతుడివైతే మనం స్నేహం కడదాం. మా యింటికిరా, చక్కని భోజనం పెడతాను," అన్నాడు.

చెప్పులు కుట్టేవాడు చెట్టు దిగి వచ్చాడు. అతనూ రాక్షసుడూ నడుచుకుంటూ రాక్షసుడి ఇంటికి వచ్చారు.

"వంటచెరుకు లేదు. అడవిలో నాలుగు దుంగలు కొట్టుకొస్తా వేమిటి?" అన్నాడు రాక్షసుడు.





"దుంగ లేమిటి? కొట్టుకు రావట మేమిటి? ఆ కనిపించే పెద్ద వృక్షాలలో ఒక దాన్ని పీకి ఈడ్చుకొచ్చి దొడ్లో పారేస్తాను," అన్నాడు చెప్పులు కుట్టేవాడు. వాడు నిజంగా అంత పనీ చేసి తన దొడ్డీ, ఇల్లూ నాశనం చేస్తాడేమో నని భయపడి రాక్షసుడు, "పోనీ ఒద్దులే. మనకు కొంచెం వంటచెరుకు చాలు. నేనే పోయి కొట్టుకు వస్తాను," అన్నాడు.

వాడు గొడ్డలి తీసుకుపోయి, నాలుగు దుంగలు నరికి తెచ్చి వంట ఇంట్లో ఒక మూల వేసి, "వంటకు నీరు లేదు. బావి నుంచి ఒక బొక్కెనడు నీళ్ళు పట్టుకొస్తావా ఏమిటి?" అని చెప్పులు కుట్టే వాణ్ణి అడిగాడు.

"బొక్కెనడు నీళ్ళా? ఛీ! ఛీ! మంచి మోకుంటే ఇయ్యి, బావికే కట్టి ఈడ్చుకొచ్చేస్తాను. దాన్ని మన దొడ్లోనే ఉంచుకుందాం," అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

అతను నిజంగా బావికి తాడు గట్టి ఈడ్చుకు రాగలడా అని సందేహం కలిగి కూడా, తీరా అంత పనీ చేసేస్తాడేమో నని భయపడి, "పోని వద్దులే. కాసిని నీళ్ళు నేనే తెస్తాను," అంటూ రాక్షసుడు, గంగాళమంత బొక్కెనను తానే తీసుకుపోయి దానితో నీళ్ళు తెచ్చాడు.

ఆ రాత్రి పడుకోబోయే దాకా చెప్పులు కుట్టేవాడు అవకాశం దొరికినప్పుడల్లా ప్రగల్భాలు పలుకుతూనే వచ్చాడు. అతని మాటలు వింటున్నకొద్దీ రాక్షసుడికి అదురు జాస్తి అయింది. ఆ రాత్రి ఎలాగైనా ఆ రణసింహుడి పీడ వదిలించుకోవాలను కున్నాడు. అందుకోసం రాక్షసుడు, "మా ఇంటో నేను పడుకునే మంచం ఒక్కటే ఉంది. దాని మీదనే నువు కూడా ఒక పక్కన పడుకో," అన్నాడు.

చెప్పులు కుట్టేవాడు సరే నన్నాడు. కాని అతనికి రాక్షసుడి దురుద్దేశం అర్థమయింది.





రాక్షసుడి మంచం చాలా పెద్దది. దాని మీద ఒక పక్క రాక్షసుడు పడుకుంటే రెండో పక్క చెప్పులు కుట్టేవాడు పడుకున్నట్టే పడుకుని, చల్లగా కిందికి దిగి, తన తల ఉండే చోట ఒక గుమ్మడికాయ పెట్టి, తాను మంచం కిందికి దూరి నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

కొంత సేపు అయాక తన అతిథి గాఢ నిద్రలో ఉంటా డనుకుని రాక్షసుడు, తన దుప్పటి కింది నుంచి ఒక ఇనపకర్ర తీసి, గుమ్మడికాయను పదిసార్లు బాది, తన పీడ విరగడ అయిందనుకున్నాడు. ఇనపకర్రను రాక్షసుడు దూరంగా పారేసిన చప్పుడు వింటూనే చెప్పులు కుట్టేవాడు మంచం కింది నుంచి పైకి వచ్చి, గుమ్మడికాయ చిదపలు తీసి పారేసి, చల్లగా తన స్థానంలో పడుకుని, గట్టిగా ఆవలించి, "ఛీ, ఛీ! ఈ మంచం నిండా నల్లు లున్నట్టున్నాయి! తెగ కుట్టి నిద్ర కాస్తా పాడుచేశాయి!" అన్నాడు విసుక్కుంటూ.

రాక్షసుడికి ముచ్చెమటలు పోసి, పై ప్రాణాలు పైన పోయినంత పని అయింది. "ఇక వీడంతట వీడు నన్ను వదిలి పోవాలే గాని, నేనై వదిలించుకో లేను," అనుకున్నాడు రాక్షసుడు.

మర్నాడు ఉదయం రాక్షసుడు వంట ప్రారంభిస్తూ, "నిన్న రాత్రి కూడా నువు సరిగా తిండి తినలేదు. ఈ పూట ఏం తింటావు?" అని చెప్పులు కుట్టేవాణ్ణి అడిగాడు.

"నిన్న సాయంకాలం రెండు అడవి దున్నలు తిన్నాను. అందుచేత ఆకలి లేక పోయింది. ఈ పూట నీతో సమానంగా తింటాను. మనిద్దరికీ పందెం!" అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

రాక్షసుడు రెండు కుంచాల అన్నం వండి, ఒక గంపెడు వంకాయలు తరగకుండానే వండేశాడు. ఇద్దరూ భోజనానికి



కూర్చున్నారు. అన్నమూ, కూరా చెరిసగం పంచుకుని తినసాగారు. చెప్పులు కుట్టే వాడు, తన చొక్కా కింద ఒక సంచీ అమర్చి అన్నమూ, కూరా అందు లోకి రహస్యంగా తోస్తూ, కొంచెం కొంచెమే నోట వేసుకోసాగాడు.

ఇద్దరి భోజనమూ పూర్తి అయింది. తాను తిన్నంతా తన అతిథి తినటం చూసి రాక్షసుడు ఆశ్చర్యపడ్డాడు.

"కాని నేనే గెలిచాను. నేను అన్నమూ కూరలూ నమల కుండా మింగాను. నువు నమిలి మింగావు," అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

"అదంతా నీ పొట్టలో ఉంటే నా కెలా తెలుస్తుంది? నమిలే మింగావేమో!" అన్నాడు రాక్షసుడు.

"కావలిస్తే పొట్ట కోసి చూపిస్తాను," అంటూ చెప్పులు కుట్టేవాడు తన చొక్కా కింద ఉన్న సంచిని కత్తితో పై నుంచి కిందికి చీరేశాడు. అన్నపు కరుళ్ళూ, ఉడికిన వంకాయలూ బయటికి వచ్చేశాయి.

"నా లాగా నువు కూడా నీ పొట్టను చీరగలిగితే నువే గెలిచావని ఒప్పుకుంటాను," అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

రాక్షసుడికి పౌరుషం వచ్చి, చెప్పులు కుట్టేవాడి కత్తితో తన పొట్టను చీరుకుని చచ్చిపోయాడు. చెప్పులు కుట్టేవాడు వాడి తల నరికి రాజుగారికి చూపాడు. రాజుగారు వాడి పరాక్రమానికి మెచ్చుకుని, వాడికి తన కూతురు నిచ్చి పెళ్ళి చేశాడు.

అటు తరవాత చెప్పులు కుట్టేవాడి పరాక్రమానికి మరి పరీక్ష జరగలేదు. పది పన్నెం డామడల దూరంలో ఉండే మరి కొందరు రాక్షసులు రణసింహు డనే వాడి పరాక్రమం గురించి విని దూరంగా కొండల్లోకి పారిపోయారు. చెప్పులు కుట్టేవాడు, రాజుగారి అనంతరం తానే రాజై సుఖంగా జీవించాడు.






ఈసారి కుబేరుడు ఇద్దరు మంత్రులను, శుక్రుడూ, ప్రోష్టపదుడూ అనే వాళ్ళను వెంట బెట్టుకుని రావణుడి వద్దకు వచ్చి, "ఓరీ, దుర్మార్గుడా, నే నెంత చెప్పినా నీ చెవికెక్కలేదు. అజ్ఞానం చేత విషం తాగిన వాడికి దాని ఫలితం పొందేటప్పుడు గాని జ్ఞానం రాదు. నీ అజ్ఞానం నీవు గ్రహించటం లేదు. నరకం అనుభవించే టప్పుడు తెలుసుకుంటావు. నీతో మాట్లా డటం వృథా," అన్నాడు.

తరవాత అన్నదమ్ము లిద్దరికీ ద్వంద్వ యుద్ధం జరిగింది. కుబేరుడు తన పైన ప్రయోగించిన అస్త్రా లన్నిటికీ విరుగుడు చేసి, రావణుడు మాయా యుద్ధం సాగించాడు. కుబేరుడికి అనేక రకాల రూపాలు కానవచ్చాయి గాని, ఎక్కడా రావణుడి రూపం కనబడలేదు. ఆ స్థితిలో రావణుడు గదతో కుబేరుడి తల పైన బలంగా కొట్టి, కింద పడగొట్టాడు. రక్తం కారుతూ పడి ఉన్న కుబేరుణ్ణి నిధుల అధిదేవతలు నందనవనానికి చేర్చి, చికిత్సలు చేశారు.

ఈ విధంగా రావణుడు కుబేరుడి పై విజయం సాధించి, పుష్పక విమానాన్ని తీసుకుని, దానిలో ఎక్కి శరవణానికి వెళ్ళాడు. ఆ కొండ బంగారం రంగులో వెలిగిపోతూ రెండో సూర్యుడి లాగా ఉన్నది. దాని పైకి వచ్చేసరికి పుష్పకం గమనం మాని ఆకాశంలో నిలిచిపోయింది.









అది చూసి రావణుడు, "కోరిన ప్రకారం నడిచే ఈ విమానం ఎందు కిలా ఆగిపోయి ఉంటుంది?" అని వెంట ఉన్న తన మంత్రులను అడిగాడు.

ఇంత లోనే, ఈశ్వరుడి పార్శ్వచరుడూ, మహాబలుడూ అయిన నంది రావణుడితో, "దశగ్రీవా, వెంటనే వెనక్కు వెళ్ళిపో. ఈ పర్వతం మీద శివుడు క్రీడిస్తున్నాడు. సుపర్ణులూ, నాగులూ, యక్షులూ, దైత్యులూ, దానవులూ, రాక్షసులూ, ఏ ఇతర ప్రాణులూ ఈ పర్వతం మీదికి రారాదు," అన్నాడు.

ఈ మాటలు వినగానే రావణుడు ఆగ్రహావేశంతో చలించిపోతూ, "శంకరు డెవడు?" అంటూ విమానం దిగి కొండ కిందికి వచ్చాడు. అక్కడ అతనికి శివుడూ, ఆయనకి కొద్ది దూరంలో శూలం పట్టుకుని, రెండవ శివుడి లాగా నిలబడి ఉన్న నందీ శ్వరుడూ కనిపించారు. నందీశ్వరుడి వానర ముఖం చూసి రావణుడు మేఘం గర్జించి నట్టుగా పగలబడి నవ్వాడు.

అపరశంకరు డైన నంది రావణుడి నవ్వుకు కోపించి, "నా కోతి ముఖం చూసి నవ్వావు గనక, నా రూపమే కలిగి, నాతో సమానమైన శక్తి గల వానరులు నిన్నూ, నీ కులాన్నీ తప్పక నిర్మూలిస్తారు," అని శపించాడు.

రావణుడు నిర్లక్ష్యంగా పర్వతాన్ని సమీపించి నందితో, "నా విమానాన్ని ఆపిన ఈ పర్వతాన్నే ఇప్పుడు పెల్లగించేస్తాను. నేను భయంకరుణ్ణని తెలియదు లాగుంది," అంటూ తన చేతులను పర్వతం కిందికి దూర్చి ఆ పర్వతాన్ని ఎత్తసాగాడు. పర్వతం సంచలించి పైకి లేచింది.

శివు డిదంతా చూసి చిరునవ్వు నవ్వి తన కాలి బొటనవేలితో పర్వతాన్ని కొద్దిగా నొక్కాడు. దానితో రావణుడి చేతులు కొండ కింద చిక్కుకుని నలిగాయి. ఆ బాధకు రావణుడు మహా దారుణంగా



ఆక్రోశించాడు. రావణుడి మంత్రులు నిర్ఘాంత పోయారు. వాళ్ళు రావణుడితో, "రాజా, శంకరుణ్ణి తృప్తి చెయ్యి. ఆయన తప్ప మరే దిక్కూ కనబడదు. ఆయనను స్తోత్రం చెయ్యి," అని సలహా ఇచ్చారు. రావణుడు బాధతో ఏడుస్తూనే శివుణ్ణి స్తోత్రం చేశాడు.

చివరకు శివు డనుగ్రహించి, రావణుడి చేతులను కొండ కింది నుంచి తీసుకోనిచ్చి, "నీ వీర్యమూ, మదమూ, స్తోత్రమూ చూసి సంతోషించాను. నీ చేతులు నలిగినప్పుడు నీవు చేసిన దారుణమైన ధ్వనిని బట్టి ఇక ముందు నీకు రావణు డనే పేరు సార్థకంగా ఉంటుంది. ఇక నీవు నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళు," అన్నాడు.

అప్పుడు రావణుడు, "మహాదేవా, నీకు నా పై తృప్తి కలిగిన పక్షంలో నేను కోరేది అనుగ్రహించు. నే నిదివరకే దేవతలు మొదలైన వారి చేత చావు లేకుండా వరం పొంది ఉన్నాను. అల్పులైన మానవులను నే నసలు లక్ష్యపెట్టను. బ్రహ్మ దేవుడు నాకు దీర్ఘాయువు కూడా ఇచ్చాడు. నేను నీ నుంచి మిగిలిన నా ఆయువునూ, ఒక ఆయుధాన్నీ వేడుతున్నాను. దయచేసి వాటిని అనుగ్రహించు," అన్నాడు.




శివుడు రావణుడికి, ఆయుశ్శేషాన్నీ, చంద్రహాస మనే ఖడ్గాన్నీ ఇస్తూ, "ఈ ఖడ్గాన్ని ఎన్నడూ అవమానించకు. ఏ నాడు దీనికి అవమానం జరిగితే అది అప్పుడే నిశ్చయంగా నా దగ్గిరికి తిరిగి వస్తుంది," అన్నాడు.

ఈ విధంగా శివుడి చేత వరాలు పొంది, రావణుడు తన పుష్పకం ఎక్కి భూమి అంతటా సంచరిస్తూ, వీరులైన రాజు లందరినీ క్షోభపెట్టాడు. పరాక్రమ సంపన్నులు అతనితో యుద్ధాలు చేసి నశించారు. తెలివి గలవాళ్ళు అతన్ని గెలవలేమని తెలుసుకుని, ఓటమి ఒప్పుకుని, అతనికి లొంగిపోయారు.



అలా లోకసంచారం చేస్తూ రావణు డొకసారి హిమాలయానికి వెళ్ళి, అక్కడ ఒక దేవస్త్రీ లాటి రూపవతిని చూశాడు. ఆమె ఋషుల లాగా కృష్ణాజినమూ, జటావల్కలాలూ ధరించి తపోదీక్షలో ఉన్నది. రావణు డామె సౌందర్యానికి సమ్మోహితుడై, సరదాకు అడుగుతున్నవాడి లాగా, "సుందరీ, ఈ యౌవనంలో తపస్సు పెట్టుకున్నావేమిటి? నీ అందం చూసి పురుషులు సమ్మోహితు లవుతారు గదా! ఎందుకీ కఠిన వ్రతం?" అని అడిగాడు.

ఆమె రావణుడికి తన వృత్తాంతం ఈ విధంగా చెప్పింది:



"బృహస్పతి కొడుకైన కుశధ్వజుడు నా తండ్రి. నా పేరు వేదవతి. అనేకమంది దేవతలూ, గంధర్వులూ, యక్షులూ, రాక్షసులూ మా తండ్రి వద్దకు వచ్చి, నన్ను తమ కిచ్చి పెళ్ళి చెయ్యమని కోరారు. కాని మా తండ్రి ఒప్పుకోలేదు. కారణ మేమిటంటే, ఆయనకు విష్ణుమూర్తినే తన అల్లుడుగా చేసుకోవాలనే కోరిక ఉండేది. ఈ సంగతి తెలిసి దంభు డనే రాక్షసుడు, ఒక రాత్రి మా తండ్రి నిద్రపోతుండగా వచ్చి, ఆయనను చంపేశాడు. మా అమ్మ ఆయనతో బాటు సహగమనం చేసింది. నేను మా తండ్రి కోరికను పూర్తిచేసే ఉద్దేశంతో విష్ణువునే నా భర్తగా మనసులో భావించుకుని తపస్సు చేస్తున్నాను. కనక, రావణా, ఇక నీవు వెళ్ళవచ్చు."

ఈ మాటలు విని రావణుడు మోహావేశపరుడై విమానం నుంచి దిగి, "అమ్మాయీ, పొగరెక్కి నీ మనస్సు వికటించింది. లేకపోతే త్రిలోక సుందరివై ఉండి, నీ యౌవనమిలా పాడుచేసు కుంటావా? నేను దశగ్రీవుణ్ణి, లంకాధిపతిని. నా భార్యవై సమస్త భోగాలూ అనుభవించు. విష్ణువు ఎవడు? నా కున్న తపస్సూ, భోగాలూ, బలమూ వాడి కున్నాయా?" అన్నాడు.



"నీ కేమాత్రమైనా బుద్ధి ఉంటే విష్ణువును గురించి అలా చులకనగా మాట్లాడవు," అన్నది వేదవతి.

వెంటనే రావణుడు ఆమె జుట్టు పట్టుకున్నాడు. వేదవతి కోపావేశంతో తన చేతులను కత్తులు లాగా చేసి తన జుట్టును కోసేసింది. తన క్రోధాగ్నితో రావణుణ్ణి దహించేదాని లాగా అయిపోయి, ఆ వేదవతి అగ్నిని ప్రజ్వలింప జేసి, రావణుడితో, "నీచుడా, నీ చేత అవమానించబడి ఇక జీవించను. ఈ అగ్నిలో పడి ప్రాణాలు వదిలి, నిన్ను చంపటానికి అయోనిజను గానూ, పతివ్రతగానూ పుట్టి తీరుతాను," అంటూ అగ్నిలో దూకేసింది. ఆ వేదవతే సీతగా పుట్టి, జనకుడి ఇంట పెరిగి, రాముడికి భార్య అయి, రాముడి బలంతో రావణుడి చావుకు కారకురా లయింది.

వేదవతి అగ్నికి అహుతి అయిపోయాక రావణుడు తిరిగి పుష్పకం మీద లోక పర్యటన చేస్తూ, మరుత్తమహారాజు దేవతలను దగ్గిర పెట్టుకుని, యజ్ఞం చేస్తున్న చోటికి వచ్చాడు. బృహస్పతి తమ్ముడైన సంవర్తుడు యజ్ఞం చేయిస్తున్నాడు. రావణుణ్ణి చూస్తూనే అక్కడ చేరిన దిక్పాలకులు భయభ్రాంతులై మారు రూపాలు ధరించారు. ఇంద్రుడు



నెమిలి అయాడు, యముడు కాకిగా మారాడు, కుబేరుడు తొండ రూపాన్నీ, వరుణుడు హంస రూపాన్నీ ధరించారు. మిగిలిన దేవతలు తలా ఒక జంతువు రూపమూ పొందారు.

ఇంతలో రావణుడు నిస్సంకోచంగా యజ్ఞవాటికలో జొరబడి, మరుత్తును చూసి, "యుద్ధం చేస్తావా? ఓడానని ఒప్పుకుంటావా?" అని అడిగాడు.

"నువ్వెవరు?" అని మరుత్తుడు రావణుణ్ణి అడిగాడు.

రావణుడు పెద్దగా నవ్వి, "భేష్, రావణుణ్ణి కూడా నీ వెరగవు! నా బలపరాక్ర



మాలను గురించి ఎరగనివాడు మూడు లోకాలలోనూ మరొకడు ఉంటాడనుకోను. నా అన్నను జయించి నే నీ విమానం కాజేశాను," అన్నాడు.

ఆ మాట విని మరుత్తు మండిపడుతూ, "తండ్రి లాటి అన్ననే జయించిన నీ వెంత ఘనుడవు! అటువంటి దుర్మార్గం చేసినందుకు గర్వపడుతున్నావా? కొంచెం ఆగు, నా బాణాలతో నీ ప్రాణాలు తీస్తాను," అని లేచి వెళ్ళి ధనుర్బాణాలు తీసుకున్నాడు.

అప్పుడు మరుత్తమహారాజుకు సంవర్తుడడ్డుపడి, "రాజా, తొందర పడక నేను చెప్పేది విను. ఈ మహేశ్వర యజ్ఞం మధ్యలో విఘ్నం అయితే వంశ నాశనం జరుగుతుంది. యజ్ఞ దీక్షలో ఉన్న నీవు ఆగ్రహించట మేమిటి? యుద్ధం చెయ్యట మేమిటి? అది అలా ఉంచి, యుద్ధంలో ఈ రాక్షసుణ్ణి ఎలా జయిస్తావు? వాడు దుర్జయుడు!" అన్నాడు.

గురువు చెప్పిన మాట విని మరుత్తు ధనుర్బాణాలు వదిలేసి తిరిగి యజ్ఞ దీక్షలో కూర్చున్నాడు. అది చూసి రావణుడి మంత్రి అయిన శుకుడు సంతోషంతో, "రావణుడిదే గెలుపు!" అని పెద్దపెట్టున కేకలు పెట్టాడు. రావణుడు యజ్ఞవాటికలో ఉండే ఋషులను తిని తృప్తి చెంది, తన దారిన తాను వెళ్ళాడు.

తరవాత దిక్పాలకులు తమ నిజ రూపాలు ధరించి, తాము ఏయే ప్రాణుల రూపాలు ధరించారో వాటికి వేరు వేరుగా వరా లిచ్చారు.

అప్పటి దాకా నెమళ్ళు నల్లగా ఉండేవి, ఇంద్రుడు వాటికి అనేక రంగు లుండేటట్టూ, తన వెయ్యి కళ్ళూ వాటి పింఛాలలో అలంకారంగా ఉండేటట్టూ, వాటికి పాముల భయం లేకుండా ఉండేటట్టూ, ఇంద్రుడు పంపే వర్షం వాటికి ఆహ్లాదం కలిగించేటట్టూ వర మిచ్చాడు.



అలాగే యముడు కాకులకు ఏ రోగమూ లేకుండానూ, వాటికి సహజ మృతి లేకుండానూ, కాకుల కడుపు నిండితే తన లోకంలో ఉండే పితృదేవతల కడుపులు నిండేటట్టూ వర మిచ్చాడు.

వరుణుడు హంసలకు నురుగు లాటి దేహ కాంతీ, జలజీవనమూ, సుఖప్రదమైన జీవితమూ ఇచ్చాడు. కుబేరుడు తొండలకు బంగారు వర్ణం ఇచ్చాడు.



రావణుడు లోకమంతా తిరుగుతూ మరుత్త మహారాజును అడిగినట్టే, గొప్ప గొప్ప రాజు లందరి వద్దకూ వెళ్ళి, "నాతో యుద్ధం చేస్తావా ఓడినట్టు ఒప్పుకుంటావా?" అని అడుగుతూ వచ్చాడు. దుష్యంతుడూ, సురథుడూ, గాధీ, గయుడూ, పురూరవుడూ మొదలైన రాజులందరూ రావణుడికి ఓడినట్టు ఒప్పుకున్నారు. అయోధ్యను పాలిస్తూ ఉండిన అనరణ్య మహారాజు మటుకు రావణుణ్ణి యుద్ధానికి రమ్మన్నాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో అనరణ్యుడి సేనలు కార్చిచ్చులో నల్లులు మాడినట్టు మాడి చనిపోయారు. ద్వంద్వ యుద్ధంలో అనరణ్యుడి బాణాలు రావణుణ్ణి ఏమీ చెయ్యలేక పోయాయి. రావణుడు తన నెత్తిన చేతితో చరిచేసరికి అనరణ్యుడు రథం నుంచి కిందికి పడిపోయి, ప్రాణాలు విడుస్తూ, తన ఇక్ష్వాకు వంశంలో పుట్టబోయేవాడి చేతిలో రావణుడు చస్తాడని శపించాడు.

రావణుడీ విధంగా గగన విహారం చేస్తూ, మానవ జాతిని మహా భయపెడుతూ తిరుగుతుండగా ఒకనాడతని పుష్పకానికి ఎదురుగా నారద మహాముని మబ్బుల మీదుగా వస్తూ ఎదురయాడు. ఇద్దరూ ఆగి మాట్లాడుకున్నారు.

"నాయనా, రావణా! నీ బలపరాక్రమాలు చూసి ఎంతో సంతోషించాను. కాని ఒకటి నాకు నచ్చలేదు. దేవతల వల్ల

కూడా చావు లేని నీవు అల్పులైన మానవుల మీద నీ ప్రతాపం చూపిస్తా వేమిటి? మానవులు అనేక వ్యసనాల తోనూ, రోగాల తోనూ, క్షణంలో వచ్చిపడే వార్థక్యం తోనూ, రకరకాల కష్టాల తోనూ తీసుకుంటూ ఉంటారుగదా, అలాటి వాళ్ళతో వీరు డెవడైనా యుద్ధానికి తలపడతాడా? వాళ్ళందరినీ యముడు చంపుతూనే ఉన్నాడు. ఆ యముడితో యుద్ధం చెయ్యి, అతణ్ణి చంపు. యముణ్ణి చంపితే నరలోకమంతా జయించినట్టే గద," అన్నాడు నారదుడు.

"అయ్యా, నారదా! నేను ముందు పాతాళాన్నీ, తర్వాత స్వర్గాన్నీ జయించి, మూడు లోకాలనూ, స్వాధీన పరచుకుని, తరవాత సముద్రాన్ని మథించి, అమృతం సంపాదించే ఆలోచనలో ఉన్నాను," అన్నాడు రావణుడు.

"ఈ పక్కనే ఉన్న యమలోకాన్ని వదిలి ఇంకెక్కడికో పోతానంటా వేమిటి? నీ విప్పుడు వెళ్ళే దారే అది," అన్నాడు నారదుడు.

రావణుడు కాలమేఘం మెరిసినట్టుగా నవ్వి, "చాలా బాగా చెప్పావు, నారదా. మంచి సంతోషకరమైన మాట. నే నిప్పుడే యమలోకానికి పోతాను. అసలు దిక్పాలకులను నలుగురినీ జయించాలని అదివరకే ప్రతిజ్ఞ పట్టాను. ఇప్పుడు వెళ్ళి, అన్ని ప్రాణులకూ మరణభయం కలిగించే ఆ యముడి ప్రాణాలు తీస్తాను," అని నారదుడికి నమస్కారం చేసి శలవు పుచ్చుకుని, తన మంత్రులతో సహా దక్షిణ దిక్కుగా బయలుదేరాడు.

అన్ని ప్రాణులనూ చంపే యముడికి చావనేది ఎలా కలుగుతుందో నారదుడికి కొంచెం కూడా అర్థంకాలేదు. ఆ యముణ్ణి రావణుడు ఎలా జయిస్తాడో కళ్ళారా చూడాలని కుతూహలం పుట్టి నారదుడు కూడా యమపట్టణానికే బయలుదేరాడు.






1. ఒక రాజభవనంలో ఒక నౌకరు కుర్రవాడుండేవాడు.



2. మర్నాడు జరగబోయే విందుకని వాడు అలంకరణలు చేస్తూండగా ఆస్థాన మాంత్రికుడు లోపలికి రావటం కనబడింది.



3. మాంత్రికుడేవో మంత్రాలు చదివాడు. గదిలోకి పొగ ప్రవేశించింది.



4. మాంత్రికుడా పొగను తన కేసి పిలిచాడు—



5. ఒక బుడ్డీ పైకి తీసి, పొగను అందులోకి పట్టి, బిరడా పెట్టాడు.



6. కుర్రవాడికి సీసాలో ఒక అమ్మాయి ఆకారం కనిపించింది. మాంత్రికుడు వెళ్ళిపోయాడు.



1. రాజుగారు మాంత్రికుణ్ణి వెంటపెట్టుకుని వచ్చాడు. రాజకుమార్తె కనిపించటం లేదు.



2. మరొక దుర్మార్గుడైన మాంత్రికుడీ పని చేశాడని మాంత్రికుడన్నాడు.



3. "నేనా దుర్మార్గుణ్ణి నిన్న సాయంకాలం నగరం వెలపల చూశాను. దాఖలా కావాలంటే—"



4. మాంత్రికుడి మంత్రశక్తి చేత ఒక పాత్రలోని నీటిలో రాజకుమార్తె ముఖం కనబడింది. ఆమె ఆక్రోశిస్తున్నది.



5. "తమ మెడలో ఉండే హారం శక్తి గలది. దాన్ని నా కిస్తే రాజకుమార్తెను రక్షిస్తాను," అన్నాడు మాంత్రికుడు.



6. రాజు హారాన్ని ఇవ్వబోతుండగా, "ఇవ్వకండి. వాడే ఇంత పని చేసింది!" అని పై నుంచి వినిపించింది.



1. మాంత్రికుడు హారాన్ని ఒడిసి లాక్కుని గవాక్షం కుండా దూకి మాయమయాడు.



2. కుర్రవాడు పై నుంచి దిగి వచ్చి, తాను కళ్ళారా చూసిన దంతా రాజుగారికి చెప్పాడు.



3. రాజుగారు ఆగ్రహావేశంతో పాత్రలోని మంత్ర జలాన్ని ఒక్క తన్ను తన్నాడు.



4. ఒక భూతం ప్రత్యక్షమై తనను విడుదల చేసినందుకు కృతజ్ఞత చెప్పుకున్నది. రాజుగారు సహాయం చెయ్యమంటే మానవులకు సహాయం చెయ్యలే నన్నది.



5. "యోధులు రాజకుమార్తెను రక్షించలేరు. సూర్యుడు సాక్షిగా ఎడారి దాటి మాంత్రికుడి కోటను చేరడం అసంభవం," అన్నదిభూతం.



6. కుర్రవాడు వెంటనే బయలుదేరాడు. కణకణ లాడే కొండలు అతని దారికి అడ్డుగా కనిపించాయి.



1. అతను కొండలను దాట నారంభించాడు.



2. కొద్ది దూరం వెళ్ళేసరికల్లా అతని పైన పెద్ద నీడ పడింది.



3. గండభేరుండపక్షి ఒకటి అతన్ని పట్టుకుని—



4. కొండల మీదుగా తీసుకుపోయి—



5. అవతలి పక్క నింపాదిగా దించింది.



6. కుర్రవాడు కంగారుపడి, వెనుతిరిగి చూడకుండా ముందుకు పరిగెత్తసాగాడు.



1. "మానవులకు నేను సాయపడలేక పోయినా, నా మిత్రుల చేత సాయం చేయించగలను," అని భూతం అనడం కుర్రవాడికి తెలీదు.



2. మండు టెడారి! సూర్యుడి సాక్షిగా ఎవరూ దాన్ని దాటలేరు.



3. కుర్రవాడు సూర్యు డస్తమించిన దాకా ఆగి, రాత్రి వేళ బయలుదేరాడు.



4. కళ్ళ కొక గుడ్డ గంతలా కట్టుకుని వేగంగా పరుగెత్తసాగాడు.



5. సూర్యోదయం వేళ మాంత్రికుడి కోట ఎదురుగా కనిపించింది.



6. "వంట పనిలో సాయపడే నౌకరీ కావాలి," అన్నాడు కుర్రవాడు.





1. కుర్రవాడి ఉద్యోగం మాంత్రికుడు తినే ఆహారాన్ని ముందుగా చవి చూడటం. మాంత్రికుడు అతన్ని గుర్తించ లేదు.

2. మాంత్రికుడి సారాయిలో కుర్రవాడు మత్తు మందు కలిపాడు. మాంత్రికుడు మత్తుగా నిద్రపోయాడు.





3. కుర్రవాడు హారాన్ని తీసేసుకున్నాడు. వాడిలో గొప్ప శక్తి వచ్చింది.

4. వెంటనే వాడు మాంత్రికుడి కార్ఖానా లోకి వెళ్ళాడు.





5. రాజకుమార్తె బంధించి ఉన్న బుడ్డి కనబడింది.

6. విరుగుడు ఏమిటా అని పుస్తకాలు తిరగేస్తుండగా అడుగుల చప్పుడు వినబడింది!



1. మాంత్రికుడు నిద్రలేచి మోసం గ్రహించాడు.



2. కుర్రవాడు చిక్కులో పడ్డాడు. అంతలో ఒక చుంచు, "ఆ బుడ్డిలోని ద్రావకం తాగు," అని చెప్పింది.



3. ఈ చుంచు కూడా భూతం స్నేహితుడే. కుర్రవాడు ద్రావకం తాగి చుంచు ప్రమాణానికి దిగబెరిగాడు.



4. "నా వెంట రా," అన్నది చుంచు.



5. కలుగు కుండా ఇద్దరూ మరొక హాలులోకి వెళ్ళారు. అక్కడ మంత్రపు తివాసీ ఉన్నది.



6. తిరిగి మామూలు ప్రమాణానికి పెరిగిన కుర్రవాడు తివాసీ ఎక్కి ఉడాయించాడు!



1. కుర్రవాడు రాజభవనానికి చేరి—



2. బుడ్డీ రాజుగారి కిచ్చాడు.



3. రాజుగారు హారాన్ని బుడ్డీకి తగిలించేసరికి—





4. రాజకుమార్తె మామూలు మనిషి అయి బుడ్డీ నుంచి వెలువడింది.

5. రాజు కుర్రవాడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు. అంతా సుఖంగా ఉన్నారు.



# గరుడ గర్వభంగం

దేవేంద్రుడికి రథ సారథీ, అత్యంత సన్నిహితుడూ అయిన మాతలికి సుధర్మ అనే భార్య ఉండేది. వారికి లేక లేక ఒక ఆడపిల్ల కలిగింది. ఆమెకు గుణకేశి అని పేరు పెట్టుకుని, ఎంతో గారాబంగా పెంచారు. గుణకేశి పెరిగి యౌవనవతి అయి, మూడు లోకాల లోనూ తన వంటి సౌందర్యవతీ, లావణ్యవతీ, అంగసౌష్ఠవం గలదీ లేదనిపించుకున్నది. ఆమెకు పెళ్ళియీడు వచ్చే సరికి మాతలికి తగని విచారం పట్టుకున్నది. ఎందుచేతనంటే, గుణకేశికి తగిన వరుడు మామూలు మానవులలో గాని, ఇతర దేవ గణాలలో గాని, ఋషులలో గాని ఆయనకు ఒక్కడైనా కనిపించలేదు.

చివరకు మాతలి విసుగు చెంది తన భార్య అయిన సుధర్మతో, "అమ్మాయికి తగిన రూపవంతుడూ, గుణవంతుడూ పాతాళలోకంలో దొరుకుతాడేమో చూస్తాను," అని చెప్పి పాతాళానికి ప్రయాణమయాడు.

ఆయనకు దారిలో నారదుడు తగిలి, కుశలప్రశ్నలు చేసి, "ఎక్కడికి ప్రయాణం? సొంత పని మీదనా? ఇంద్రుడి పని మీదనా?" అని అడిగాడు.

మాతలి తన పని గురించి నారదుడికి చెప్పి, "నేను వరుణుణ్ణి చూసి పాతాళం పర్యటించబోతున్నాను," అన్నాడు.

"ఇకనేం? నేనూ వరుణుణ్ణి చూడటానికే పోతున్నాను. ఇద్దరమూ కలిసే పోదాం," అన్నాడు నారదుడు.

నారదుడికీ, మాతలికీ వరుణుడు ఘనమైన స్వాగతం ఇచ్చి, ఇంద్రుడికి జరపదగిన మర్యాదలన్నీ మాతలికి జరిపాడు. తరవాత వారు వరుణుడి అనుమతితో

పురాణ కథ





పాతాళం లోని వివిధ ప్రాంతాలు పర్యటిం చుతూ వెళ్ళారు.

ఒకచోట హిరణ్యపుర మనే మహా నగరం ఉన్నది. అది మయుడు నిర్మించి నది. ఇతర లోకాలలో ఓడిపోయిన రాక్షసులు అక్కడ నివసిస్తున్నారు. అలాటి నగరంలో అల్లుణ్ణి అన్వేషించటానికి మాతలికి మనస్కరించలేదు.

తరవాత వారిద్దరూ నాగలోకంలో ఉండే భోగవతి పురానికి వెళ్ళారు. అమరావతి పట్టణానికి తీసిపోని ఆ నగరంలో వాసుకి రాజు. శేషుడు మొదలుగా గల మహా సర్పాలు అక్కడ ఎందరో ఉంటున్నారు.

ఆ నగరంలో తిరుగుతుండగా ఒక చక్కని యువకుడు మాతలి కంటపడ్డాడు. మాతలి నారదుడితో, "దేవర్షీ, ఆ కుర్రవా డెవరు? అతని తల్లిదండ్రు లెవరు? ఇతను నాకు బాగా నచ్చాడు," అన్నాడు.

"ఇతని పేరు సుముఖుడు. వీళ్ళది ఐరావత వంశం, ఆర్యకుడు ఇతడి తాత గారు. ఇతడి తండ్రిని, చికురు డనే వాణ్ణి, ఈ మధ్యనే గరుత్మంతుడు చంపాడు," అన్నాడు నారదుడు.

"కుర్రవాడు చాలా అందంగా ఉన్నాడు. వీడు నా కూతురిని చేసుకోవటానికి సమ్మతించేటట్టు చెయ్యగలవా?" అని మాతలి నారదుడితో అన్నాడు.

నారదుడు మాతలిని వెంటబెట్టుకుని ఆర్యకుడి వద్దకు వెళ్ళి, "ఇతను తన కుమార్తెకు తగిన వరుడి కోసం మూడు లోకాలూ వెతికి, చివర కిక్కడ నీ మనవణ్ణి చూసి తనకు అల్లుడు కాదగినవాడని ఎన్నుకున్నాడు. అందుచేత ఇతని కుమార్తె గుణకేశిని నీ మనవడు సుముఖుడికి చేసుకుంటే చాలా బాగుంటుంది," అన్నాడు.

దానికి ఆర్యకుడు దీనంగా, "నారదా, ఎంతో చక్కని మాట చెప్పావుగాని, నా మనసులో సంతోషం లేదు. ఎందు

కంటావా, నా మనమడికి మహా విపత్తు సిద్ధంగా ఉంది. గరుత్మంతుడు మొన్న మొన్న నే వీడి తండ్రిని పొట్టన పెట్టుకున్నాడు. పై మాసంలో వీణ్ణి చంపి తింటానని శపథం చేశాడు," అన్నాడు.

అది విని మాతలి, "నాగరాజా, నీ మనవణ్ణి అల్లుడుగా వరించాను గనక, అతన్ని కాపాడే భారం నాది. సుముఖుణ్ణి మా వెంట పంపితే, నే నతన్ని దేవేంద్రుడికి పరిచయం చేసి, చెయ్యవలసినదంతా చేస్తాను. మీరేమీ దిగులు పడవద్దు," అన్నాడు.

మాతలీ, నారదుడూ, సుముఖుడూ కలిసి దేవలోకానికి తిరిగివచ్చి, ఇంద్రుడి సమక్షానికి చేరారు. వారు చేరే సమయానికి ఇంద్రుడూ, విష్ణువూ కబుర్లు చెప్పుకుంటున్నారు. మాతలి విష్ణువుతో సంగతి సందర్భాలు చెప్పాడు. విష్ణువు అంతా విని ఇంద్రుడితో, "ఇంద్రా, సుముఖుడికి అమృతం ఇచ్చి అతనికి చావు లేకుండా చెయ్యి," అన్నాడు.

ఇంద్రుడు అలా చెయ్యటానికి భయపడ్డాడు. పరాక్రమవంతుడైన గరుత్మంతుడితో వైరం పెట్టుకోవటం ఇష్టం లేక, ఇంద్రుడు విష్ణువుతో, "ఆ అమృతం నీవే యియ్యి," అన్నాడు.



"అన్ని లోకాలకూ అధిపతివి, నిన్ను కాదనగలవా డెవడు? అమృతాన్ని నీవే ఇయ్యి," అన్నాడు విష్ణువు.

అయినా ఇంద్రుడు సుముఖుడికి అమృతమిచ్చే సాహసం లేక, దీర్ఘాయువిచ్చాడు. దానితోనే సుముఖుడికి గరుత్మంతుడి భయం పోయింది. అతను మాతలి కూతురిని పెళ్ళాడి, తన లోకానికి తిరిగి వెళ్ళిపోయాడు.

మాతలి నారదుల కోరికపై ఇంద్రుడు సుముఖుడికి దీర్ఘాయు విచ్చిన వార్త విని మండిపడుతూ గరుత్మంతుడు మహావేగంతో ఇంద్రుడి వద్దకు వచ్చి, మహారౌద్రంగా,

"ఏమిటిది, ఇంద్రా ? నా నోటి దగ్గిరి కూడు తీసేస్తావా ? బ్రహ్మ నాకు ఆహారంగా ఏర్పాటు చేసినదాన్ని నిరాకరించటానికి నీ కేమి హక్కుంది ? ఆ సుముఖుణ్ణి చంపి తింటానని ప్రతిజ్ఞ కూడా చేశాను. ప్రపంచంలో నా వంటి బలాఢ్యుడు లేడు. ఒక్క ఈకతో నిన్ను సునాయాసంగా మోయగలను. నేను విష్ణువును వీపు మీద మోస్తూ సేవ చేస్తున్నానని నీకు లోకువైనట్టుగా ఉన్నది. ఈ విష్ణువు మూలంగానే నా పరువంతా పోయింది," అని ఒళ్ళు తెలియకుండా పేలాడు.

అతని పేలాపన విని విష్ణుమూర్తి, "గరుడా, నీకు బుద్ధిలేదు. అతిదుర్బలుడవై ఉండి కూడా నా ఎదటనే ఆత్మస్తుతి చేసుకుంటున్నావు. నన్ను మోస్తున్నానని నీ వనటం అనుచితమూ, అబద్ధమూనూ. నన్ను నేనే మోసుకుంటూ నిన్ను కూడా మోస్తున్నాను. నీకు నమ్మకంలేని పక్షంలో నా ఎడమ చెయ్యి ఒక్కటి మొయ్యి, చాలు," అంటూ తన ఎడమ చేతిని గరుత్మంతుడి వీపు పైన పెట్టాడు.

ఆ బరువుకు గరుత్మంతుడు అణగారిపోయి, మూడు లోకాలూ ఒక్కపెట్టున తన పైన విరుచుకు పడినట్టయి, గిలగిలా తన్నుకోసాగాడు.

ఆ గరుత్మంతుడు ప్రాణాలు తల్లడిల్లి కొట్టుకుంటూ, "చచ్చిపోతున్నాను. అజ్ఞానం చేత కారుకూతలు కూశాను. నిన్ను మోస్తున్నాననే పొగరే నన్నీ గతికి తెచ్చింది. రక్షించు!" అని దీనంగా ప్రార్థించాడు.

విష్ణుమూర్తి అనుగ్రహించి, "ఇంకెప్పుడూ ఇలా పేలకు. ఇంద్రు డిచ్చిన వరాన్ని గౌరవించి, సుముఖుడితో సఖ్యంగా ఉండు. నీకు నిజంగా గర్వభంగమైనట్టు అదే శాశ్వతమైన గుర్తు," అన్నాడు. అది మొదలు గరుత్మంతు డెప్పుడూ సర్పాన్ని తన వెంట ఉంచుకుంటూ వచ్చాడు.



# 48. డరైయస్ శిలాచరిత్ర

మన దేశంలో బుద్ధుడు తన మతాన్ని ప్రచారం చేస్తున్న కాలంలో డరైయస్ అనే "రారాజు" పర్షియను రాజవంశాన్ని స్థాపించి "బగస్తాన" (భగవంతుడి స్థలం) అనే చోట తన చరిత్రను కొండ పైన, 340 అడుగుల ఎత్తున మూడు భాషలలో చెక్కించాడు. ఆ చెక్కడాలు (బొమ్మ చూడండి) మనుషులు ఎక్కదగిన ప్రాంతానికింకా 100 అడుగుల ఎత్తున ఉన్నాయి.

ఈ చెక్కడాల లోని బొమ్మలు డరైయస్ ఏ విధంగా తన ప్రతిపక్షులను నిర్జించి బందీలుగా పట్టుకున్నదీ చూపుతాయి. (డరైయస్ ఎడమ నుంచి మూడోవాడు) తన కాలి కింద తన ప్రధాన శత్రువును తొక్కుతున్నాడు. మిగిలినవారు పెడరెక్కలు విరిచికట్టి, మెడలకు తాడు కట్టి, అతనికి ఎదురుగా నిలబడి ఉన్నారు. వారికి ఎగువగా ఉన్న బొమ్మ డరైయస్ ఇష్ట దైవమైన "అహురమజ్ద"ది. అయన డరైయస్‌ను చెయ్యెత్తి దీవిస్తున్నాడు. ఈ శత్రువులను జయించి, క్రీ. పూ. 522 లో డరైయస్ రాజయాడు.

2,500 ఏళ్ళ నాటి ఈ శిలాచరిత్రలో డరైయస్ తన కథను మూడు భాషలలో—ప్రాచీన పర్షియను, బాబిలోనియను, ఎలామైట్ భాషలలో చెక్కించాడు. మొదటి భాషలో 515 పంక్తులూ, రెండవ దానిలో 141 పంక్తులూ, మూడవ దానిలో 650 పంక్తులూ ఉన్నాయి. వీటి పూర్తి పాఠాలు 1950 లో లభించాయి.



Photo by Bhalchandra Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

హాయికొలిపే నిద్ర

పంపినవారు :
ఎస్. ఆర్. దేవరాజులు, మద్రాసు

Photo by Devidas Kasbeker



బహుమతి
పొందిన వ్యాఖ్య

అకతాయి నిద్ర

పంపినవారు:
ఎన్. ఆర్. దేవరాజులు, మద్రాసు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 జనవరి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : హాయికొలిపే నిద్ర

రెండవ ఫోటో : అకతాయి నిద్ర

పంపినవారు : ఎన్. ఆర్. దేవరాజులు,

రామానుజకూటం స్ట్రీట్, మద్రాసు–21

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

నిరపాయకరంగా గుండ జలుబుకు. సాధారణ జలుబుకు అమోఘంగా గుణాన్నిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. కండనొప్పికి. తలనొప్పికి. బెణుకులకు కూడా అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించ వలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబావి కళ్లా నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/[illegible]


SPECTRUM
COLOUR
PENCILS

తెలుపులో రంగులలో బాండ్, మ్యానిఫోల్డింగు కాగితములు - లెడ్జర్
క్రీమ్‌లెయిడ్ - తెలుపు, రంగుల ప్రింటింగ్ కాగితములు మొదలైనవి.

తయారు చేయువారు :

బల్లార్పూర్ పేపర్ అండ్ స్ట్రాబోర్డ్ మిల్స్ లిమిటెడ్.,

దక్షిణ ఇండియాకు డిస్ట్రిబ్యూటర్లు :

## జయ్‌సు దయాళ్ కపూర్,

ఫోన్ : 21738    2, అండర్సన్ స్ట్రీట్,    తంతి : JAIKAPSO

మదరాసు - 1.



## రాజ్ బంధు ఇన్‌డస్ట్రియల్ కంపెనీ

నం. 2, అండర్సన్ స్ట్రీట్ (మేడపైన)

మదరాసు -1.



డిస్ట్రిబ్యూటర్లు :

శ్రీ గోపాల్ పేపర్ మిల్స్ లిమిటెడ్.,

పుడుంజీ పేపర్ మిల్స్ ప్రైవేట్ లిమిటెడ్.,



## "ఆర్చిలైట్"

ఎక్సర్‌సైజు నోట్ బుక్స్ మరియు
అకౌంటు బుక్స్ తయారు చేయువారు

# కొత్త టైరా టివియస్ రిట్రెడా?

## ఏమో యజమానికే తెలియాలి!

మీవంటి విచక్షణ గల కారు యజమాన్లు టైర్లను రిట్రెడ్ చేయించుకొని వాటివల్ల పూర్తి ప్రయోజనం పొందగోరుతారు. అయితే, రిట్రెడ్ అని స్పష్టంగా కనిపించే టైర్లు వాడటం మీకు ఇష్టముండదు. టివియస్ రిట్రెడ్ టైర్లు కొత్తవిలాగే కనిపిస్తవి: అవి రిట్రెడ్‌లని మీకు మాత్రమే తెలుసు.

టివియస్ ఇండియాలో రిట్రెడ్ చేసే సంస్థల్లో కల్లా పెద్దది.

## సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్

(టివియస్ సంస్థ) బెంగళూరు - కోయంబత్తూరు - మద్రాసు
పుదుక్కోట్టై - సికింద్రాబాదు - తిరునల్వేలి.




JWT-TVS-SI 2905




జవహర్‌లాల్ నెహ్రూ
యిలా అన్నారు. "భావిలో సౌఖ్యానికి
విశ్రాంతికి తావులేదు. మనము ఎడతెగక
కష్టపడి పనిచేయాలి." కనుక
ఆయన ఆత్మకు శాంతి చేకూర్చడానికి ఎక్కువ పనిచేసి
జాతీయ సంపదకు ఎక్కువ ఉత్పత్తి చేద్దామని కంకణము కట్టుకొందాము.




గ్వాలియర్ & హైదరాబాదు

©JB-136 TL

'అదనపు
తెలుపుదనము
ఎక్కడ నుంచి
వస్తుంది?'




బట్టలకు ఆఖరున ఝాడించేటప్పుడు కొంచెము టినోపాల్ మాత్రమే వేస్తే, ఎంతో ధగ ధగ లాడే తెలుపుదనము మీరు వుతికిన బట్టలకు వస్తుంది—షర్టులు, చీరలు, దుప్పట్లు, తువ్వాళ్లు. అయితే, మీకు దాని ఖరీదు ఎంత అవుతుంది? బట్టకు ఒక పైస కూడా అవదు! అదే, సైంటిఫిక్ పద్ధతిలో తెలుపుదనము నిచ్చు టినోపాల్ యొక్క గొప్ప సుగుణము .. బట్టలకు ఏ మాత్రము హానికరమైనది కాదు.

## టినోపాల్ అన్నిటికన్న తెలుపుదనము నిచ్చును

సుహృద్ గైయిగి లిమిటెడ్, పి.ఒ. బాక్సు 965.
బొంబాయి-1. బిఆర్




టినోపాల్, జె. ఆర్. గైయిగి ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడ్ మార్కు

Shilpi-SGT-70 TEL

# AWARDS!

# WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST

ONLY
WE DO OUR BEST



**PRASAD PROCESS PRIVATE LTD**
CHANDAMAMA BUILDINGS MADRAS-26

